# మీరు బయాలజీ తీసుకున్నా జియాలజీ తీసుకున్నా స్నేహితుల మధ్య బంధానికి క్లియరసిల్ తప్పనిసరి



## ఎందుకంటే క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.

మీ జట్టులో మీరు వెలగిపోతూ వుండాలంటే ఈ ఫార్ములా బట్టీ పట్టండి. క్లియరసిల్ చర్మం. దీంతో మీరెప్పుడూ ఫెయిలవరు.

ఎందుకంటే క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. దాంతో మిమ్మల్ని చూస్తున్న వాళ్ళు అలా చూస్తూనే వుండిపోతారు.

ఇదంతా మొటిమలపై మూడు రకాలుగా పనిచేసే క్లియరసిల్ విశిష్టత.

ఒకటి - ఇది మొటిమల్లోకి చొచ్చుకుపోతుంది. రెండు - ఎక్కువైన జిడ్డును తొలగిస్తుంది. మూడు - దీంతో

క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.




మొటిమలు ఎండిపోతాయి.

గొడవలేక తేలిపోయింది, మొటిమలను పోగొట్టడంలో క్లియరసిల్ ప్రపంచమంతటా నం. 1.

మరందుకే మొటిమలను మీ స్నేహాల దారికి అడ్డు రానివ్వకండి. క్లియరసిల్ తెచ్చుకోండి. మీ స్నేహాలకు కొరతే వుండదు.




**మొటిమలను పోగొట్టడంలో* క్లియరసిల్ ప్రపంచమంతటా నం. 1.**

క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.

Enterprise/PG/CC/P/3/Tl b




1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

## వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

## వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

## వనిత

1991
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదహారవ
సంవత్సరం....






కారణం
● విజ్ఞానానికి ● వికాసానికి ● వినోదానికి

## వనిత

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## నూతన సంవత్సరానికి స్వాగతం!

ప్రతి కొత్త సంవత్సరమూ కొత్త కొత్త ఆశలను తెస్తుంది. పాత సంవత్సరానికి వీడ్కోలు పలికి, నూతన సంవత్సరానికి స్వాగతం చెప్పడం సంప్రదాయం!

1990వ సం॥లో ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో ముఖ్యమైన సంఘటనలు—మంచివీ, చెడువీ జరిగాయి. అనేక దేశాలలో స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం ఘన విజయాలు సాధించాయి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం రెండుగా చీలిపోయిన జర్మనీ, ఇప్పుడు మళ్ళీ ఒకటయింది. యూరపు దేశాల మధ్య నూతన అవగాహన, సహకారం ఏర్పడే శుభసూచనలు కనిపిస్తున్నాయి. అగ్రరాజ్యాలయిన సోవియట్ రష్యా, అమెరికా దేశాలు ఆయుధపోటీని అరికట్టడానికి పూనుకోవడం ఎంతయినా సంతోషించతగ్గ విషయం.

ఇక మనదేశ పరిస్థితులు మాత్రం అంత ఉత్సాహకరంగా లేవు. రోజురోజుకూ మత కలహాలు కార్చిచ్చులా విజృంభిస్తున్నాయి. యువకులలో, విద్యార్థులలో అసంతృప్తి, అలజడి ఎక్కువవుతున్నాయి. ఈ క్లిష్ట పరిస్థితులను సరిదిద్దడం కష్టమే. కాని, మనసుంటే మార్గముంటుంది. దేశ సమైక్యతనూ, ప్రగతినీ దృష్టిలో వుంచుకుని ప్రతిఒక్కరూ పాటుపడడం అవసరం.

ప్రస్తుత సమస్యలన్నిటినీ పరిష్కరించే శక్తిని ప్రసాదించమని దేవుని ప్రార్థిస్తూ, నూతన దశాబ్దానికి తొలి సంవత్సరమైన 1991కి స్వాగతం పలుకుదాం!

సంపుటి 88 జనవరి '91 సంచిక 1

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00






# జపాన్ నూతన చక్రవర్తి




పసిఫిక్ మహాసముద్రంలోని ద్వీప సముదాయమైన జపాన్ దేశంలో ప్రపంచంలో కెల్లా అతి ప్రాచీనమైన రాచరికపు వ్యవస్థ ఆచరణలో ఉన్నది. ఈ రాజవంశం క్రీ. పూ. 660 వ సం॥ ప్రారంభమయింది. ఆ దేశప్రజలు చక్రవర్తులను దైవాంశ సంభూతులని నమ్మేవారు!

భారతదేశం నుంచి జపాన్‌కు బౌద్ధమతం ఎప్పుడో వ్యాపించినప్పటికి, 19 వ శతాబ్ద మధ్య కాలం వరకు, జపాన్ బాహ్యప్రపంచంతో, ముఖ్యంగా పశ్చిమదేశాలతో సంబంధ బాంధవ్యాలు పెంచుకోవడానికి సిద్ధంగా లేదు. అయితే, సంబంధాలు ఏర్పడ్డాక, జపాన్, ఆసియా ఖండంలోనే సంపన్నదేశంగానూ, గొప్ప శక్తిగానూ రూపొందింది!

రెండవ ప్రపంచ యుద్ధసమయంలో జపాన్, హిట్లర్ జర్మనీ పక్షం వహించి అమెరికాను ఎదిరించింది. మొదట అనేక దేశాలను జయించింది కూడా. అయితే, యుద్ధం కొత్తమలుపు తిరగడంతో జర్మనీ, దాని మిత్రపక్షాలు పరాజయం పొందాయి. జపాన్, లొంగిపోవడానికి వెనకాడడంతో, అమెరికా 1945 వ సం॥ ఆగస్టు 6 వ తేదీన మొదటి అణుబాంబును హిరోషిమా మీదా,

రెండవ అణుబాంబును 9వ తేదీన నాగసాకి మీద ప్రయోగించింది. ఆఖరికి జపాన్ చక్రవర్తి తన ఓటమిని అంగీకరిస్తూ, లొంగి పోవడానికి సమ్మతిని తెలియజేస్తూ రేడియో ద్వారా ప్రకటించాడు. పైగా తనలో ఎలాంటి దైవాంశ లేదని ప్రజలకు తెలియజేశాడు!

అనాటి నుంచి, చక్రవర్తి కార్యకలాపాలు కేవలం లాంఛన ప్రాయాలుగా మారాయి. అయి నప్పటికీ, తమ రాజును దైవాంశ సంభూతుడుగా విశ్వసించే సంప్రదాయవాదులు ఈనాడు కూడా పలువురున్నారు. రాచరికపు వ్యవస్థను సమూలంగా రద్దు చేయాలనే తీవ్రవాదులు కూడా ఉన్నారు.

చక్రవర్తి హిరో హిటో 87వ యేట 1989వ సం॥లో మరణించాడు. తదనంతరం ఆయన కుమారుడు యాభై ఆరేళ్ళ అకిహిటో, చక్రవర్తి బాధ్యతలు చేపట్టాడు. అయినా, పట్టాభిషేక మహోత్సవం ఇటీవల అంటే గత నవంబర్‌లోనే, టోక్యోలో వైభవోపేతంగా జరిగింది!

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసే నాటికి, జపాన్ శిథిలావస్థలో ఉండేది. అయినా, ఆ దేశం ప్రస్తుతం అన్ని రంగాలలోనూ అత్యంత అభివృద్ధిని సాధించింది. ప్రపంచ దేశాలలో జపాన్ ఒక మహోన్నత పారిశ్రామిక శక్తిగా రూపొందింది. చాలామంది జపాన్ ప్రజలు తమ చక్రవర్తిని, తమ జాతి ఐక్యతకు చిహ్నంగానే భావిస్తున్నారు!





# మల్లన్న మంచితనం

వల్లభరాయపాలెంలో, మల్లన్న అనే ఒక పేదరైతు వుండేవాడు. రెల్లుగడ్డితో కప్పిన ఒక చిన్న పూరిపాక, ఎకరంన్నరపొలం అతడి జీవనాధారం. పగలనక, రాత్రనక పొలంలో కష్టించి పనిచేసి, దాని మీద వచ్చే ఆదాయంతో కాలం గడుపుతూండేవాడు.

మల్లన్న చాలా నెమ్మదస్థుడు. కల్లాకపటం ఎరగనివాడు. ఎవరైనా కోపం కొద్దిగానీ, మూర్ఖత్వంవల్ల గానీ అతణ్ణి, "నువ్వు వెర్రిబాగులవాడివి, ఏదీ చేతకానిచవటవి!" అని తిట్టినా, నవ్వి, "అవును మీరు చాలా తెలివైనవాళ్ళు! అలాగే అనుకోండి," అని జవాబిచ్చేవాడు.

అతడు పసితనంలోనే తల్లీదండ్రుల్ని పోగొట్టుకున్న ఒక అనాధబాలుణ్ణి చేరదీసి ఎంతో ప్రేమగా పెంచసాగాడు. వాడికప్పుడు నాలుగేళ్ళ వయసు. ఆ ఊళ్ళో అందరూ వాణ్ణి మల్లన్న కొడుకనే వాళ్ళు. వాడు మల్లన్నకు పంచప్రాణాలయితే, పొలం ఆరోప్రాణం.

ఆఏడాది పంటపొలాలన్నీ బాగున్నాయి. ఊళ్ళోని అందరి పొలాలతో పాటు, మల్లన్న పొలం కూడా విరగ పండింది. ధాన్యం అమ్మితే లోగడ కన్న రెట్టింపు డబ్బు వస్తుంది. ఆ కారణం చేత, మల్లన్న పొలం పంట మీద ఎంతో ఆశ పెట్టుకున్నాడు.

గత రెండేళ్ళుగా వానాకాలంలో, పాక మీద కప్పిన రెల్లుగడ్డిలోంచి నీరు కారుతున్నది. పాకకు రెల్లుబదులు, పెంకు కప్పించాలి. కాడెడ్లు ముసలివయిపోయాయి, మంచి జతకొనాలి. కొడుక్కు కనీసం మూడు, నాలుగు మంచి దుస్తులు కుట్టించాలి—మల్లన్న ఇలా ఆలోచించసాగాడు.

కాకాని కమల



అయితే, పంట ఒకవారం రోజుల్లో కోతకు వస్తుందనగా, ఒక పెద్ద అవాంతరం వచ్చి పడింది!

ఉన్నట్టుండి, ఒక సాయంకాలంవేళ ఉరుములూ, మెరుపులూ లేకుండా, ఆకాశంలో కారుమబ్బులుకమ్మి, క్షణాల్లో ఉధృతంగా తుపానుగాలులు ప్రారంభమై, రాత్రి తెల్లవార్లూ కుండపోతగా ఒకటే వాన. ఆ జలప్రళయానికి ఊరిపక్కన వున్న నదికి గండిపడి, ఉరకలు పరుగులతో వరదనీరు పొంగసాగింది.

దానితో కోతకు సిద్ధంగా వున్న ఊరి పంటపొలాలన్నీ నీటిలో మునిగిపోయాయి. జమీందారుగారి ఐదువందల ఎకరాల పంటపొలం, నదికి దాపులవుండడంతో సర్వనాశనం అయిపోయింది.

ఇది చూసి మల్లన్న కుప్పకూలిపోయాడు. అయితే, క్షణాలమీదతెప్పరిల్లి, ఏనాడూ ఎరగని కోపంతో రౌద్రంగా, "ఏడాదంతా కష్టపడి పండించిన పంట, చేతికి అందే సమయానికి దక్కకుండా చేస్తాడా, ఆ దేవుడు!" అంటూ చేతికర్ర పట్టుకుని, ఆవేశంతో ఊగిపోతూ ఊరి చివరికొచ్చాడు.

నిన్నటిదాకా పచ్చగా బంగారు కంకులతో కళకళ్ళాడిన పంటచేలన్నీ, నామరూపాలు లేకుండా ఎర్రని బురదనీటిలో మునిగిపోయాయి. మల్లన్న చమటోడ్చి పండించిన పొలంలోకి కూడా ఎర్రని బురదనీళ్ళు పొంగుతూ వస్తున్నవి. అది చూసి మల్లన్న గుండె భగ్గుమన్నది.

అతడు పొలం గట్టుమీద నిలబడి, తన పంటపొలాన్ని కబళిస్తున్న ఎర్రని బురదనీళ్ళకేసి చూస్తూ ఆవేశంగా, "ఇదిగో! నాకు కోపం వచ్చిందంటే ఏం జరుగుతుందో తెలుసా? ఆగు! నా పంటపొలాన్ని పాడుచెయ్యకు!" అంటూ అరిచి చేతికర్రను అటూ ఇటూ ఆడించాడు.

అంతే! పరవళ్ళు తొక్కుతూ మల్లన్న పంటపొలాన్ని ముంచుతున్న ఎర్రని వరదనీరు, చిత్రంగా ఆగిపోయింది.

అంతకుముందు పొలంలో నిండిన నీరంతా కెరటాలు, కెరటాలుగా కొద్ది సేపట్లో వెనక్కు తిరిగిపోయింది. పొలంలోని ఒక్క వరిమొక్క కూడా నేలబడకుండా, ఎప్పటిలా బంగారు కాంతులీనే నిండు కంకులతో కళకళలాడ సాగింది.

అది చూస్తూనే మల్లన్న ఎంతో శాంతంగా, "ఆఁ, అదీ! నా మాట అలా వినాలి. అప్పుడు నాకు కోపం అంటూ రాదు," అన్నాడు.

కొద్దిసేపట్లోనే, ఈ జరిగింది ఊరూ వాడా గుప్పుమని, క్రమంగా పొరుగు గ్రామాలకు వ్యాపించింది. మల్లన్ననీ, అతడి పంటపొలాన్నీ చూడడానికి జనం తండోపతండాలుగా రాసాగారు. మల్లన్న దగ్గిర ఏవో మహిమలున్నాయని, అందరూ అనుకున్నారు.

ఇది జరిగిన కొద్దిరోజుల తర్వాత, ఇంకొక విచిత్రం జరిగింది: మల్లన్న నాలుగేళ్ళ కొడుకు ఆడుకుంటూ కాలు జారి దిగుడుబావిలో పడ్డాడు. ఆ సమయంలో పొలంలో వున్న మల్లన్న, ఈ వార్త విని పరుగు, పరుగున బావి దగ్గిరకు వచ్చి, నిండుగా వున్న బావిలోకి తొంగి చూస్తూ, కోపంగా, "ఈ బావి దిబ్బపడి పోవాలి! నా పసిబిడ్డను బలి తీసుకుంటుందా?" అన్నాడు.



ఆ మరుక్షణం బావి ఇసుక మేట వేసినట్టు దిబ్బ అయిపోయింది. నీళ్ళల్లో మునుగుతూ, తేలుతూ ఉక్కిరిబిక్కిరి అవుతున్న పసివాడు, ఇసుకలో ఆడుకుంటున్నట్టు పరిగెత్తుకుంటూ వచ్చి, రెండు చేతులతో మల్లన్న కాళ్ళు చుట్టుకున్నాడు.

బావిచుట్టూ గుమిగూడిన జనం, ఈ అద్భుతాన్ని చూసి నిశ్చేష్టులయ్యారు. మల్లన్న నిజంగానే మహిమలు కలవాడనే భావం, వాళ్ళల్లో దృఢపడిపోయింది.

ఈసారి జనం తీర్థయాత్రికుల్లా మల్లన్ననూ, బావినీ చూసేందుకు రాసాగారు. వాళ్ళు వట్టిచేతులతో కాక,



తమ తమ శక్తికి తగినట్టు పళ్ళూ, పూలూ, కొబ్బరికాయలూ తేవడం ప్రారంభించారు. మల్లన్నకు దినకృత్యాలు స్తంభించి పోయాయి. పొలం పనులు చూసుకునేం దుకూ్కడా అవకాశం చిక్కడం లేదు.

ఈ పరిస్థితుల్లో, ఒకనాడు మల్లన్న తనను దేవుడంతటివాడంటూ పొగడే వాళ్ళతో కోపంగా, "మీ రనేదేమిటి? ఇప్పుడు నేనున్న పూరిపాక దేవాలయం అనా? అలాగే కానివ్వండి!" అన్నాడు.

అంతే! మరుక్షణం పూరిపాక ఆకా శాన్నంటేంత ఎత్తుగా పెరిగి, గుడి గోపు రంగా మారిపోయింది. గాలిగోపురానికి వున్న చిరుగంటలు గణగణమోగాయి.

అక్కడ తీర్థప్రజలా గుమిగూడిన జనంలో కొందరు, ఇది చూసి అచ్చెరువు చెందారు. మరికొందరు హాహాకారాలు చేశారు. మల్లన్న గుడిగోపురం కేసి శాంతంగా చూస్తూ వుండిపోయాడు.

అంతలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసింది. ఆ వెంటనే ఒక కంఠస్వరం, "మహామహులకూ, మంచివాళ్ళకూ కోపం రాదు. ఒకవేళ వస్తే, ఆ కోపంలో అన్న మాటలు నిజం అయిపోతాయి. వినండి! మంచితనమే దేవుడు!" అన్నది.

ఆ వెంటనే జనం, "మల్లన్నే, ఈ గుడిలో దేవుడు!" అంటూ కేకలు పెట్టారు.

మల్లన్న రెండు చేతులూ ఎత్తి పెద్దగా, "కానేకాదు. మంచితనమే దేవుడు. చేతనయితే, ఆ దేవుణ్ణి ఈ గుడిలో ప్రతిష్ఠించండి!" అన్నాడు.

గ్రామ జమీందారు ముందుకు వచ్చి, మల్లన్నను కౌగలించుకున్నాడు. ఆయన మల్లన్నను ఒక చక్కని భవనానికి తీసుకు పోయి, అందులో వుంచి, గుడిని తన వశం చేసుకున్నాడు. మంచితనం అనే దేవుడి విగ్రహాన్ని అందులో ప్రతిష్ఠ చేయాలన్నది, ఆయన ఆలోచన.

కాని, మంచితనం గురించి వినడమే కాని, దాని రూపం ఎలా వుంటుందో ఎవ్వరికీ తెలియదు. అందువల్ల, జమీం

దారు మంచితనం అంటే ఎలా వుంటుందో చక్కగా వివరించగలవారికి బహుమానం ఇస్తానని చాటింపు వేయించాడు. ఆవిధంగా మంచితనం రూపురేఖల్ని శిల్పంగా చెక్కించి గుడిలో పెట్టాలని జమీందారు అనుకున్నాడు.

అయితే, రోజులు గడిచిపోతున్నాయి కాని, ఎవరూ మంచితనం గురించి సంతృప్తికరమైన వివరణ ఇవ్వలేక పోయారు.

ఈ పరిస్థితుల్లో మల్లన్నకు జబ్బు చేసింది. జమీందారు అతడికి మంచి వైద్యులచేత చికిత్స చేయించాడు. కాని, ఇక వ్యాధి నయం కాదని తెలిశాక, ఆయన మల్లన్నను నీ ఆఖరికోరిక ఏమిటని అడిగాడు.

అందుకు మల్లన్న, "జరిగిన అద్భుతాలు చూసి, జనం నేను దేవుణ్ణనుకుంటున్నారు. అది నిజం కాదు. ఆనాడు ఆకాశవాణి పలికినట్టు మంచితనమే దేవుడు. దాన్ని ఏదో ఒక రూపంలో దేవాలయంలో ప్రతిష్ఠించండి!" అని కోరాడు.

మల్లన్న చనిపోయాక జమీందారూ, ఊరి పెద్దలూ ఒకచోట చేరి, మంచితనం అంటే ఏమిటి? దాని ఆకారవిశేషాలు ఎలా వుంటవి? అన్న విషయం గురించి చాలాసేపు వితర్కించారు. చివరకు అందరూ ఏకాభిప్రాయంగా తేల్చిన దేమంటే—మల్లన్న భగవంతుడి మెప్పు పొందిన మంచివాడు; యోగ్యుడు. అతడిప్పుడెలాగూ లేడు గనక, అతడి రూపాన్ని శిల్పులచేత చెక్కించి గుడిలో ప్రతిష్ఠ చేయాలని.

సంవత్సరం తిరక్కుండానే మల్లన్న విగ్రహం తయారైంది. ఆ విగ్రహాన్ని చూసినవాళ్ళకు; దేవుడు మంచివాళ్లల్లోనే వుంటాడు. మంచితనం అంటే, అచ్చం మల్లన్నలాగే వుంటుంది! అనిపించింది.

ఆ విధంగా పూరిపాకస్థానంలో వెలిసిన గుడిలో, మంచితనమనే దేవుడుగా మారాడు మల్లన్న!



# బహుమతి!

రాజాస్థానంలో గుమాస్తాగా పనిచేసే అనంతశర్మ, ఖజానాలో జరిగిన పెద్ద దొంగతనాన్ని తెలివిగా బయటపెట్టి, మహారాజునుంచి ఒక ఉంగరాన్ని బహుమతిగా సంపాయించాడు.

ఆ తర్వాత, ఆస్థానంలోని రాఘవుడు అనే అధికారి నిజాయితీవల్ల, చిన్న మోసం ఒకటి బయటపడింది. నేరస్థులు దొరికిపోయారు. మహారాజు ఆ అధికారికి పెద్దమొత్తంలో కొన్ని వరహాలూ, నగలూ బహూకరించాడు.

ఇది తెలిసి అనంతశర్మ ఆశ్చర్యపోయి, మహారాజుతో, "ప్రభూ, పెద్ద దొంగతనం బయటపెట్టిన నాకు, ఒక చిన్న ఉంగరాన్ని బహూకరించారు. అతి చిన్న మోసాన్ని తెలిపిన రాఘవుడుగారికి మాత్రం, అంతపెద్ద బహుమతి యిచ్చారు. ఇది న్యాయం అవుతుందా?" అన్నాడు.

ఇందుకు మహారాజు చిరునవ్వుతో, "శర్మా, నీకు ఉంగరం బహుమతిగా ఇస్తే ఎంత సంతోషపడ్డావో, నీ కంటే పెద్ద అధికారి అయిన రాఘవుడు కూడా అంతగా సంతోషపడాలంటే, బహుమతి ఆయన హోదాకు తగ్గట్టుగా వుండాలికదా! ఇక్కడ ప్రధానంగా ఆలోచించవలసింది, మీ హోదాలకు తగ్గ బహుమతి యివ్వడంగానీ, మీరు పట్టుకున్న దొంగతనాలు చిన్నవా, పెద్దవా అని కాదు," అని వివరించాడు.

మహారాజు చెప్పినదాంట్లో నిజం అర్థం చేసుకున్న అనంతశర్మ, తన తొందరపాటుకు సిగ్గుపడ్డాడు.

—భీమవరపు పురుషోత్తం






## 17

[వీరసింహుడు శంకరవర్మ కుమార్తె సుకన్యను, శాంతిపురానికి తీసుకుపోయే మార్గంలో, ఆమె స్పృహతప్పి పడిపోయింది. గుడారం వేయించి, సుకన్యకు విశ్రాంతి ఏర్పాటు చేశారు. సాయంకాలానికి, వీరసింహుడు గుడారంలోకి వెళ్లి, సుకన్యను పలకరించబోయాడు. యువరాణి స్థానంలో ఉన్న ఒక కోతిపిల్ల అతడి ముఖాన్ని గాయపరచి పారిపోయింది. —తరవాత]

వీరసింహుడు పట్టరాని ఆగ్రహంతో, కోతి పిల్లను పట్టుకోమని సైనికులను ఆజ్ఞాపించాడు. యువరాణి సుకన్యను ఏ మాంత్రికుడో తన మాయాజాలంతో కోతి పిల్లగా మార్చాడనే వీరసింహుడు భావించాడు. గుడారం లోపలికి వెళ్ళివచ్చిన వైద్యుల వెంట యువరాణి మారువేషంలో తప్పించుకుని వుంటుందనిగానీ, వైద్యుడు వెంట తెచ్చిన పెద్ద సంచీలో రహస్యంగా పెంపుడు కోతిపిల్లను తెచ్చి, అక్కడ వదిలి వుండవచ్చని గానీ అతడు ఊహించలేక పోయాడు.

వీరసింహుడి కేకలు సర్పదంతుడికి కూడా ఆశ్చర్యం కలిగించాయి. మాయాజాలం మీద, మంత్రతంత్రాల మీద వాడికి నమ్మకం లేదు. కాని మంత్రప్రభావంవల్లే తమకీగతి పడుతున్నదన్న భావాన్ని వీరసింహుడికి కలిగించినవాడు సర్పదంతుడే.



బంగారు విగ్రహాన్ని రక్షించలేని తన చేత కానితనాన్ని కప్పిపుచ్చడానికే వాడా కట్టుకథ చెప్పాడు. వీరసింహుడు దాన్ని నమ్మాడు. ఇప్పుడు యువరాణి మాయం కావడానికి కారణం మనుషుల తంత్రమే తప్ప, మాంత్రికుల మాయాజాలం కాదని సర్పదంతుడికి తెలుసు. అయినా, వీర సింహుడి భ్రాంతిని పోగొడితే తన అబద్ధం బయటపడిపోతుందని వాడు భయ పడ్డాడు.

''మహాప్రభూ, మనకు ఏ మాంత్రికు డయినా సహాయం చేస్తే తప్ప మనం ఇలాంటి మంత్రప్రభావం నుంచి బయట పడలేము!'' అన్నాడు సర్పదంతుడు.

''అది నిజమే కాని, కోతిపిల్లను యువ రాణిగా మార్చగల మాంత్రికు డెవడైనా నీకు తెలుసా? వాడికి ఎంత ధనమైనా ఇవ్వడానికి మేము సిద్ధంగా వున్నాం,'' అన్నాడు వీరసింహుడు.

''తమ ఆలోచన అద్భుతంగా వున్నది ప్రభూ! అయినా, మనం మొదట కోతిగా మారిన యువరాణిని పట్టుకోవాలి. అసంఖ్యాకమైన కోతులలో దానిని కను గొనడం ఎలా అన్నదే సమస్య!'' అన్నాడు సర్పదంతుడు.

వీరసింహుడు ఏదో చెప్పబోయాడు. అంతలో ఒక చిలుక అతని తల మీదుగా ఎగరడం కనిపించింది. అతడు తలెత్తి చూడగానే, చిలుక గొట్టంలాంటి దానిని అతడి మీదికి జారవిడిచి ఎగిరిపోయింది.

సర్పదంతుడు లేఖను తీసి వీరసింహు డికి ఇచ్చాడు. వీరసింహుడు కాగడా వెలుతురులో ఆ లేఖను చదివాడు: ''వీర సింహా! నీచమైన నీ కోరిక నుంచి తప్పించు కోవడానికే యువరాణి కోతిపిల్లగా మారి పోయింది! నీకు సిగ్గులేదా? ఇంకా నీలో ఏపాటి వివేకం మిగిలివున్నా, మర్యాదగా శాంతిపురం తిరిగి వెళ్ళు. శంకరవర్మకు గాని, జయపురి ప్రజలకు గాని హాని తల పెట్టావో నీ ప్రాణాలు దక్కవు జాగ్రత్త! ఇది యువరాజు సందీపుడి ఆజ్ఞ!''

"యువరాజు సందీపుడు! ఎవడి యువరాజు?" అని అరిచాడు వీర సింహుడు.

ఇంతకు ముందు కూడా సర్పదంతుడికి ఇటువంటి హెచ్చరికలు వచ్చాయిగాని, వాడా విషయం వీరసింహుడికి చెప్పలేదు. ఎందుకంటే, అది వాడు వీరసింహుణ్ణి మభ్యపెడుతూన్న మాయమంత్రాలకు వ్యతిరేకమైన విషయం!

"బందిపోట్ల నాయకుడై ఉంటాడు ప్రభూ!" అన్నాడు సర్పదంతుడు.

"దుర్మార్గుడయిన బందిపోట్ల నాయకుడు తనను యువరాజనిచాటుకుంటాడా? ఎంత పొగరు? ఇప్పుడే మనం జయపురిని ఆక్రమిద్దాం. వాడు ఏం చేస్తాడో చూద్దాం. సైన్యం సిద్ధమే కదా?" అని అడిగాడు వీరసింహుడు.

"క్షణంలో సిద్ధం చేస్తాను ప్రభూ! పైగా, జయపురికి సైన్యమే లేదు. వాళ్ళు మనల్ని ప్రతిఘటించలేరుకదా!" అన్నాడు సర్పదంతుడు.

"మూర్ఖుడా, ఆ సంగతి కూడా మాకు తెలియదనుకున్నావా? ఒకవేళ జయపురి, అమృతపురి రక్షణను కోరినట్టయితే, ఆ సేనలను ఎదుర్కోవడానికి సిద్ధంగా వున్నావా? ఆ విషయం మాకు తెలియాలి," అన్నాడు వీరసింహుడు.



సర్పదంతుడు కొంతసేపు మౌనం వహించి, "ప్రభూ, అమృతపురి సైనికంగా చాలా బలపడిందని చారుల ద్వారా తెలిసింది. మనం సైనిక బలాన్ని పెంచుకుంటే తప్ప, అమృతపురి సేనలను ఎదుర్కోవడం ఆపదను కొని తెచ్చుకోవడమే అవుతుంది!" అన్నాడు.

"మళ్ళీ నువ్వు పాతపాటే పాడుతున్నావు. మనం సైనికబలాన్ని పెంచుకోవడం ఎలా? ఆయుధాలు కొనడానికి కావలసిన ధనం గాని, ధాన్యం గాని సమకూర్చుకోలేక పోయాం. ప్రతిదానికీ తిరుగుబాటుదార్లు అడ్డు తగులుతున్నారు. ప్రజల అండదండలతో



పాటు, ఆ దుర్మార్గులకు అరణ్య మృగాల, పక్షుల సహాయం కూడా లభిస్తున్నాయి!'' అన్నాడు వీరసింహుడు బాధగా.

''ఏదైనా రహస్యనిధి దొరికినా బావుం డేది!'' అన్నాడు సర్పదంతుడు.

''రహస్యనిధి! రహస్యనిధి!'' అంటూ వీరసింహుడు కొంతసేపు తీవ్రంగా ఆలోచించాడు. హఠాత్తుగా అతడి కొక ఆలోచన వచ్చింది. పురాతన భవనాలలో రహస్య నిధులు వుంటాయి కదా! మరి శాంతిపుర రాజభవనంలో మాత్రం రహస్య నిధులు ఎందుకు ఉండవు?

''రాజభవనానికి వెళదాం!'' అంటూ వీరసింహుడు గుర్రం మీదికి ఎక్కి కూర్చుని అదిలించాడు. అతడి వెంట సైన్యం కూడా బయలుదేరింది!

* * *

వీరసింహుడికి రాత్రల్లా నిద్రపట్టలేదు. సర్పదంతుడితో కలిసి రాజభవనంలోని గదులన్నిటినీ పరిశోధించి చూశాడు. రాజభవనంలో చిరకాలంగా పని చేస్తూన్న వృద్ధులయిన ఇద్దరు సేవకులను పిలిపించి, ''మేము చూడని గదులేవైనా వుంటే చూపండి. చూపారంటే మీకు చక్కటి బహుమతి ఇస్తాం. తెలిసీ చూపక పోయారో చిత్రవధ చేయిస్తాం,'' అని బెదిరించాడు. ఆఖరికి ఆ ఇద్దరిలో ఒక సేవకుడు వాళ్ళను చీకటి గొయ్యిలా వున్న మారుమూలకు తీసుకుపోయాడు. గోడను అనుకుని సన్నటి సందువంటి మార్గం కనిపించింది. ఆ మార్గంగుండా కొంత దూరం వెళ్ళాక, ఎప్పుడో తాళం వేసిన పాత తలుపు కనిపించింది.

వీరసింహుడూ, సర్పదంతుడూ చాలా కష్టపడి తాళాన్ని బద్దలు కొట్టారు. ఇరువురూ చిన్న కాగడా వెలుగులో గది లోపలికి జొరబడ్డారు. అక్కడ భోషాణాల వంటి కొన్ని పెట్టెలు ఒకదానిపై ఒకటి అమర్చబడి ఉన్నాయి. వీరసింహుడు ఒక ఇనుపపెట్టెను తెరిచాడు. నిండా రకరకాల పురాతన ఆభరణాలు!

''సర్పదంతా! మన సమస్య తీరి పోయింది!" అనికేక వేశాడు వీరసింహుడు.

సర్పదంతుడి కళ్ళు పెద్దవయ్యాయి. పట్టరాని ఆనందంతో ఇరువురూ ఒక్క నిమిషం మాట్లాడలేకపోయారు. ఆ తరవాత తేరుకుని ఒక్కొక్క పెట్టెగా తెరిచి, వాటి లోని ఆభరణాలు చూసి, పొంగి పోయారు.

''ఆభరణాలు దొరికాయి. కాని, వాటితో ఆయుధాలు కొనడం ఎలా అన్నదే ప్రస్తుత సమస్య!" అన్నాడు వీరసింహుడు.

''ప్రభూ, అదేం సమస్య కాదు. చంద్రపురి ఆయుధ వ్యాపారులను పిలిపించి, వాళ్ళచేత ఆభరణాల విలువను బేరీజు వేయిద్దాం. ఆ తరవాత ఆయుధాల బేరం కుదుర్చుకోవడం సులభం!'' అన్నాడు సర్పదంతుడు.

''కొన్ని ముఖ్యమైన ఆభరణాలు తప్ప, ఉపయోగం లేని అలంకార ప్రాయాలయిన మిగతా విలువయిన ఆభరణాలనూ, వెండి బంగారు పాత్రలనూ వదులుకోవడానికి సిద్ధంగా ఉన్నాం. మనకు ఆయుధాలు కావాలి. సైనికబలం వుంటే జయపురినే కాదు; సుసంపన్నమైన అమృతపురిని కూడా అవలీలగా ఆక్రమించవచ్చు!'' అన్నాడు వీరసింహుడు ఆనందంగా.



గదికి గట్టి తాళం బిగించి, ఇరువురూ వెలుపలికి వచ్చారు.

మర్నాడు ఉదయమే, నమ్మకస్థులయిన దూతల ద్వారా తమ సందేశాన్ని చంద్రపురికి పంపారు. వాళ్లు తిరిగి వచ్చి, చంద్రపురి వ్యాపారుల నుంచి నిపుణులు మూడు రోజులలో వస్తారని తెలియజేశారు. తన చిరకాల వాంఛ తీరుతుందన్న ఆశతో వీరసింహుడు కలలు గనసాగాడు.

మూడు రోజుల తరవాత ఒక గూఢచారి వీరసింహుడి వద్దకు వచ్చి, ''ప్రభూ, చంద్రపురి వర్తకుల నుంచి ఇరవై అయిదుగురు నిపుణులు బయలుదేరి వస్తున్నారు!'' అని చెప్పాడు.



''ఇరవై అయిదుగురా! ఐదారుగురే రాగలరని అనుకున్నాం. అంటే, మన పట్ల అంతటి గౌరవం అన్నమాట! సర్ప దంతా, మంచి మంచి వంటలు చేయించు. వాళ్ళందరికీ రాజభవనంలోనే బస ఏర్పాటు చేయించు. ఈ క్షణమే ఏర్పాట్లు ప్రారంభించు,'' అని వీరసింహుడు సర్పదంతుణ్ణి ఆజ్ఞాపించాడు.

నిపుణులు శాంతిపుర రాజభవనం చేరేసరికి రాత్రయింది. వీరసింహుడు స్వయంగా ఎదురు వెళ్ళి వాళ్ళకు స్వాగతం చెప్పాడు. అల్పాహార విందు అయ్యాక, వారిని ప్రధాన మంటపంలోకి తీసుకుపోయాడు. రహస్యమందిరంలో దొరికిన విలువైన బంగారు ఆభరణాలూ, వస్తువులూ ఖోషాణాలలో అక్కడ వున్నాయి.

ఒకేచోట అసంఖ్యాకమైన ఆభరణా లనూ, వాటి నాణ్యతనూ చూసి అమి తాశ్చర్యం చెందిన నిపుణులు, ''ఆహా! వీరసింహ మహారాజు మహా భాగ్య వంతుడు! మహా భాగ్యవంతుడు!'' అని పదేపదే పొగడసాగారు.

తరవాత అందరూ విందు భోజనం చేశాక, నిపుణులు ప్రధాన మంటపం కేసి నడుస్తూ, వీరసింహుడితో, ''ఇక్కడ ఏవి ఆభరణాలు ఎన్నెన్ని ఉన్నాయి, వాటి విలువ ఎంత అన్న విషయాలు పరిశోధించి నిర్ణయించాలి. మణులు, మాణిక్యాలు పొదిగిన రాణిగారి హంసతూలికాతల్పం, శయనమందిరం గోడలకు తాపిన మణుల విలువ ఎంత వుంటుందో పరిశోధించాలి. దానికి తెల్లవాళ్ళూ సరిపోవచ్చు. అందు వల్ల మీరు మంటపానికి వెలుపల తలుపు తాళం వేస్తే మాకు రక్షణ, ప్రశాంతత లభిస్తాయి! సూర్యోదయం కల్లా మా పనులు నిరాటంకంగా పూర్తవుతాయి!'' అన్నారు.

''అలాగే, మీ ఇష్టానుసారమే చేద్దాం,'' అని వీరసింహుడు మంటపానికి వెలుపల తాళం వేయించాడు.

నిపుణులు తమ పనిలో నిమగ్నులయ్యారు. అర్ధరాత్రి దాటేవరకు లోపలి నుంచి సందడి వింటూనే ఉన్నది.

తెల్లవారగానే వీరసింహుడు తలుపు తాళం తెరిపించాడు. మనుషుల అలికిడి లేదు. కష్టపడి పని చేయడంవల్ల నిపుణులు అలిసి, నిద్రపోయారేమో అని లోపలికి వెళ్ళి వెదికి చూశారు. కాని. ఏ ఒక్కరి జాడా కనిపించలేదు!

ఆభరణాలెక్కడ? భోషాణాలెక్కడ? నిపుణులు ఏమయ్యారు? వీరసింహుడూ, సర్పదంతుడూ పిచ్చివాళ్ళలా అరుస్తూ, భవనంలోని గదులన్నిటినీ గాలించారు. కాని ప్రయోజనం లేకపోయింది!

"బందిపోట్లు! వచ్చినవాళ్ళందరూ బందిపోట్లు! వేసిన తాళం వేసినట్టే వుంది. ఆ దుర్మార్గులు ఎలా తప్పించుకున్నారు?" అని అరిచాడు వీరసింహుడు.

రాణిగారి శయనాగారంలోని రహస్య మార్గ ద్వారం, తెరిచి వుండడంతో, సర్పదంతుడు జరిగిన విషయం గ్రహించాడు. ఆ రహస్యమార్గం గుండానే వచ్చిన వాళ్ళు భోషాణాలతో సహా ఆభరణాలను తీసుకుని వెళ్ళి ఉండాలి!

అక్కడ కనిపించిన ఒక లేఖలో ఇలా ఉన్నది: "రాజకుటుంబానికి చెందిన అమూల్య ఆభరణాలను మీ నుంచి కాపాడాము. అవి రాజవంశానికి వారసుడయిన యువరాజు సందీపుడి సంరక్షణలో భద్రంగా ఉన్నవి. మరొక విషయం. మీ మనుషులను వెంటనే దక్షిణ దిక్కుగా వున్న 'ఏనుగుకొండ' దగ్గరికి పంపండి. చంద్రపురి నుంచి వచ్చిన అసలు ఆయుధ వ్యాపారులు అక్కడే వున్నారు. వాళ్ళకు ఆహారపానీయలు అందజేయండి. అంతే కాదు. వాళ్ళను బంధించిన తాళ్ళు తెగగొట్టడానికి కత్తులు తీసుకుపోవడం మరిచిపోకండి!"

సర్పదంతుడు భటులతో బయలుదేరి వెళ్ళి, తిరుగుబాటుదార్లు బంధించిన వర్తకులను బంధాలనుంచి విడిపించాడు! —(ముగింపు వచ్చే సంచికలో)






# ఆత్మాభిమానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ శయనాగారంలో హంసతూలికాతల్పం మీద హాయిగా నిద్రపోవలసిన ఈ అర్ధ రాత్రివేళ, ఎవరికోసమో ఇంతగా శ్రమల పాలవుతున్న నిన్ను చూస్తూంటే, చెప్ప లేనంత జాలి కలుగుతున్నది. నువ్వు ఎవరి కోసమైతే ఇన్ని శ్రమలకోరుస్తూన్నావో, ఆ వ్యక్తి తనకు కావలసిన ఫలితం దక్కాక కూడా, నీపట్ల కృతజ్ఞతా పూర్వకంగా ప్రవర్తిస్తాడా, అన్న సందేహం కలుగుతున్నది. ఎందుకంటే—తమ అవసరం తీరాక కృతజ్ఞత చూపకపోగా, కృతఘ్నులుగా ప్రవర్తించే వ్యక్తుల్ని సమాజంలో తరచుగా చూస్తూనే వున్నాం.

## బేతాళ కథలు



ఇందుకు ఉదాహరణగా నీకు నిర్మల అనే ఒక అనాథ యువతి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం గిరిజాపురంలో, మాధవుడనే గొర్రెలకాపరి ఒకడు వుండేవాడు. అతడికి తాతలనాటి ఆస్తి కాస్తోకూస్తో వున్నది. మాధవుడు చూడ చక్కనివాడే కాక, అత్యంత మధురంగా పాటలు పాడేవాడు. అతడికి తల్లి తప్ప ఇంకెవరూ లేరు. రాత్రివేళ భోజనం చేశాక, అతడికి ఇంటి పెరట్లో ఆరు బయట నులకమంచం మీద పడుకుని పాటలు పాడుకోవడం అంటే ఎంతో ఇష్టం. అయితే, ఆ సమయంలోనే ఒక ప్రతిబంధకం అతణ్ణి తరుచు చీకాకు పరుస్తూండేది. అదే నిర్మల !

మాధవుడి ఇంటి పొరుగున, గోపీనాధుడనే సంపన్న కుటుంబీకు డొకడుండేవాడు. ఆయన మొదటి భార్య ఒక ఆడపిల్లను కని చనిపోయింది. ఆ పిల్లే నిర్మల. ఆమె పుట్టుకుంటిది. నిర్మల తల్లి చనిపోగానే గోపీనాధుడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. ఆ వచ్చిన సవతితల్లి, నిర్మల ఆలనాపాలనా చూడడం మాట అటుంచి, అతి చిన్న వయసు నుంచే వంట పనితో సహా ఇంటి చాకిరీ అంతా నిర్మల మీద మోపి, నిర్మలను పనిమనిషి కంటే హీనంగా చూడడం ప్రారంభించింది. చిన్నతనంలో, కట్టెలపొయ్యి మీద వంట చేస్తూచేస్తూ నిర్మల, ఒకసారి ప్రమాదవశాత్తూ పొయ్యిలోకి తూలిపడిపోయి, ఒళ్ళంతా కాల్చుకున్నది. ముఖం మీద నల్లటి మచ్చలతో, ముడతలు పడిపోయిన, చర్మంతో, కుంటితనంతోబాటు వికృత రూపం కూడా వచ్చి, చూపరులకు భయం కలిగించేటట్టు తయారైంది, నిర్మల.

నిర్మల రోజల్లా గొడ్డుచాకిరీ చేసి, రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత, గొడ్లపాక దగ్గిరగా నులకమంచం వేసుకుని పడుకునేది. ఆ సమయంలో ఆమె అప్పుడప్పుడూ వెక్కివెక్కి ఏడుస్తూండేది.

ఆ ఏడుపు దాపులవున్న గోడపక్కనే పడుకుని వుండే మాధవుడి చెవులకు, కర్ణకఠోరంగా వుండేది. కమ్మగా సాగిపోతున్న తన గాన మాధురిలో, నిర్మల ఏడుపు అపశ్రుతి అనిపించేదతడికి. ఇక అతడి పాట ముందుకు సాగేదికాదు.

నిర్మలా, మాధవు లిద్దరి జీవితాలూ, ఆ విధంగా గడిచిపోతూండగా, ఒకనాడు మాధవుడు అడవిలో గొర్రెల్ని మేపుకుంటూ, ఎన్నడూ వెళ్ళనంతదూరం వెళ్ళాడు. అక్కడ అతడు ఒక సెలయేటి దాపుల గొర్రెలను మేతకు వదిలి, తనొక చెట్టుకింద చతికిలబడ్డాడు. ఆ ప్రదేశపు రామణీయకత చూడగానే, మాధవుడిలో ఆవేశం ఒక్కసారిగా పొంగులువారింది. అతడు తన్మయత్వంతో ఒళ్ళు మరిచి గొంతెత్తి పాడసాగాడు. అలా అతడి పాట చాలాసేపు సాగింది.

చివరకు మాధవుడు కళ్ళు తెరిచి చూసేసరికి, ఎదురుగా ఒక మునీశ్వరుడు కూర్చుని, అతడి పాటను ఆనందంగా వింటూ కనిపించాడు. మాధవుడు చప్పున లేచి నిలబడి, ఆయనకు భక్తితో నమస్కరించాడు.

ముని చిరునవ్వునవ్వి, అతణ్ణి ఆశీర్వదించి, "నాయనా! మనశ్శాంతి లేక కొన్ని వారాలుగా బాధపడుతున్న నన్ను, నీ



పాట ఎంతో సేద దీర్చింది. నీ మనసులో ఏదైనా కోరిక వుంటే చెప్పు; నాకు సాధ్యమైనంతలో తీరుస్తాను," అన్నాడు.

ముని మాటలకు మాధవుడు పెద్దగా నిట్టూర్చి, "స్వామీ! పగలంతా కష్టపడి పని చేసి, రాత్రిళ్ళు హాయిగా మనసారా గొంతెత్తి పాడుకోవడం మినహా, నాకు వేరే కోరిక లేమీలేవు. నాకున్న ఆ ఒక్క చిన్న కోరిక తీర్చుకోవడం కూడా గగనమై పోతున్నది!" అన్నాడు.

ముని ఆశ్చర్యపోయి, "ఎందువల్ల?" అని ప్రశ్నించాడు.

జవాబుగా మాధవుడు, నిర్మల కథంతా చెప్పి, "రానురాను ఆమె ఏడుపు, నాకు



భరించ శక్యం కాకుండా పోతున్నది!'' అన్నాడు.

ముని కొద్దిసేపు మౌనం వహించి, తర్వాత, ''మాధవా! ఆమెను కొద్ది రోజుల పాటు, నా దగ్గిర వుండేందుకు తీసుకు రాగలవా?'' అన్నాడు.

మాధవుడు ఆశ్చర్యపడి, ''ఎందుకు, స్వామీ?'' అని అడిగాడు.

''తర్వాత చెబుతాను. నావల్ల ఆమెకు ఉపకారమే గాని, అపకారమేమీ జరగదని, ఆమె తల్లిదండ్రులకు చెప్పు. అదిగో, దూరంలో కనిపించే ఫలవృక్షాల చెంతనే నా కుటీరం!'' అంటూ లేచాడు ముని.

మాధవుడు ఆ రాత్రే గోపీనాథుణ్ణి కలుసుకుని, మునిని గురించీ, అతడు నిర్మలను తన వద్దకు పంపమనడం గురించీ చెప్పాడు.

భర్త ద్వారా సంగతి విన్న నిర్మల సవతితల్లి, ఈ వంకన నిర్మలను శాశ్వతంగా ఇంట్లో నుంచి సాగనంపవచ్చునని ఆనందిస్తూ, ''నిర్మలా! నీకున్న నాలుగు బట్టలూ మూట గట్టుకుపోయి, కొన్నాళ్ళ పాటు ఆ మునీశ్వరుణ్ణి సేవించుకో,'' అన్నది.

నిర్మల మర్నాడు ఉదయానే మాధవుడి వెంట ముని దగ్గిరకు బయలుదేరింది. ఇద్దరూ ముని కుటీరాన్ని చేరగానే, ముని నిర్మలను సమీపించి, ఆదరంగా తల నిమురుతూ, ''అమ్మా, నిన్ను నా కన్న బిడ్డలా చూసుకుంటాను. కొద్ది రోజుల పాటు, నా దగ్గిర వుండగలవా?'' అన్నాడు.

ముని ఆదరణకు కళ్ళనీళ్ళు తిరుగుతూండగా, నిర్మల వుంటానన్నట్టు తల వూపింది.

ముని మాధవుడికి, పది రోజుల తర్వాత రావలసిందిగా చెప్పి, పంపేశాడు.

తల్లి అనారోగ్యం, ఇతరత్రా పనుల కారణంగా మాధవుడు నెల రోజులు గడిచాక, ముని కుటీరం కేసి వెళ్ళాడు.

ఇప్పుడక్కడ కుటీరం పక్కన, తాటి యాకులతో కప్పిన మరొక పెద్ద పాక అతడి కంటబడింది. దానిముందు పది మంది స్త్రీ పురుషులు కూర్చుని వెదురుతో బుట్టలూ, రకరకాల బొమ్మలూ తయారు చేస్తున్నారు. వాళ్ళందరూ ఏదో ఒక అంగ వైకల్యం వున్నవాళ్ళే.

మాధవుడు ఆశ్చర్యపడుతూ, అక్కడ వున్నవాళ్ళలో ఒక యువకుణ్ణి, ముని కుటీరంలో వున్నారా, అని అడిగాడు. వాడు తాను మూగా, చెవిటివాణ్ణనీ కాస్త గట్టిగా మాట్లాడమనీ సైగ చేశాడు. మాధవుడు అలాగే చేశాడు. మూగయువకుడు కుటీరంలోకి పోయి, మునిని వెంట బెట్టుకు వచ్చాడు.

మాధవుడు, మునిని, "స్వామీ, ఇదంతా ఏమిటి? తమ తపస్సు ఏమైంది? నిర్మల ఆరోగ్యంగా వున్నదా?" అని అడిగాడు.

ముని నవ్వుతూ, "అదంతా చెప్పే ముందు, నన్ను గురించి నీకు కొంత చెప్పాలి," అంటూ తానొక రాతిబండ మీద కూర్చుని, ఎదురుగా వున్న మరొక రాతిబండను మాధవుడికి చూపించాడు.

తర్వాత ఆయన మాధవుడితో, ఇలా చెప్పాడు:

"నా పేరు జీవానందుడు. నేను కూడా చిన్నతనంలో నిర్మల లాగా, సవతితల్లి చేతిలో నరకబాధలు పడ్డవాణ్ణే! ఒకసారి ఆమె కోపంకొద్దీ గరిటెకాల్చి, నా శరీరం





మీద వాతలు పెట్టింది. అప్పుడు నా వయసు ఏడెనిమిదేళ్ళు. బాధ భరించలేక, ఈ అడవిలోకి పారిపోయి వచ్చాను. అప్పుడు ఈ కుటీరంలో పరమానందుడనే సాధువు తపస్సు చేసుకుంటూండేవాడు. ఆయన నా ఒంటి మీది వాతలు చూసి, కారణం అడిగాడు. నేను జరిగినదంతా చెప్పాను. ఆయన ఏవో ఆకుపసర్లు తెచ్చి, నా గాయాలకు పూశాడు.

వారం రోజుల్లో, గాయాలన్నీ మానిపోయినై. ఆనాటి నుంచీ, ఆయన మరణించేదాకా, ఆయనకు నాచేతనైన సేవలు చేస్తూ ఇక్కడే వుండిపోయాను. ఆయన దగ్గిర శాస్త్రవిద్య అభ్యసించాను. మన చుట్టూ వున్న ప్రకృతిలో లభ్యమయ్యే అనేక రకాల ఓషధులతో వైద్యం చెయ్యడం నేర్చుకున్నాను. ఆయన తనకు తెలిసిన సమస్తమూ నాకు నేర్పి, నాకు జీవానందుడన్న పేరుపెట్టి, తన కుటీరాన్ని నాకు అప్పగించి, కన్ను మూశాడు.

"ఆయన పోయిన తర్వాత, నేను ఇక్కడే తపస్సు చేసుకుంటూ కాలం గడుపుతున్నాను. ఈ పరిస్థితుల్లో, నువ్వు మృదుమధురంగా పాడుతూ నాకు కనిపించావు. తర్వాత నిర్మల వచ్చింది. ఆమె కాలిన చర్మాన్నీ, ఆమె కుంటితనాన్నీ వైద్యం చేసి చాలావరకు బాగుపరిచాను. ఈ మధ్య ఒక రోజున, ఆ మూగవాడు సెలయేటి ఒడ్డున స్పృహ తప్పిపోయి నిర్మలకు కనిపించాడు. నీళ్ళకోసం సెలయేటికి వెళ్ళిన నిర్మల, అతణ్ణి వెంటబెట్టుకు వచ్చింది. వెదురు ఇస్తే చాలు, అతడు చెయ్యలేని వస్తువంటూ లేదు!

"ఆ తర్వాత మరికొందరు వికలాంగులు ఇక్కడికి వచ్చారు. అందరికీ చికిత్స చేస్తున్నాను. నిర్మల ఇప్పుడు పూర్తిగా స్వస్థురాలు. ఆమె ఏ క్షణాన ఇంటికి తిరిగి వెళ్ళ దలుచుకున్నా వెళ్ళవచ్చు: వెళ్ళ దలుచుకోని పక్షంలో ఇక్కడే వుండవచ్చు!"

ముని చెప్పినదంతా ఆశ్చర్యపోతూ విన్న మాధవుడు, ఏదో ప్రశ్నించబోయేంతలో, నిర్మల సెలయేటి నుంచి నీళ్ళ కుండతో అక్కడికి వచ్చింది. మాధవుడు, ఆమె కేసి చూసి దిగ్భ్రాంతుడయ్యాడు. ఆమె శరీరం మీద కాలిన గుర్తులు ఏమాత్రం లేకపోగా, ఆమె శరీరచ్ఛాయ పసిమివన్నెతో మెరిసిపోతున్నది. ఆమె కళ్ళల్లో పూర్వపు బేలతనమూ, భీతీ స్థానంలో, ప్రశాంతతచోటు చేసుకున్నది. ఒక్క మాటలో—ఆమె మరొక జన్మ ఎత్తినదానిలా వున్నది.

మాధవుణ్ణి చూసిన నిర్మల, చప్పున నీళ్ళకుండ దింపి, మాధవుడికి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించింది. మాధవుడికి ఇక మునితోగాని, ఆమెతోగాని ఏం మాట్లాడాలో తోచలేదు. అతడు వాళ్ళవద్ద సెలవు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు.

ఆ రాత్రి మాధవుడికి కన్ను మూసినా తెరిచినా, నిర్మలే కనిపించసాగింది. మర్నాడు తెల్లవారుతూనే అతడు జీవానందుణ్ణి కలుసుకుని, ''స్వామీ! రాత్రంతా నేను, నిర్మల గురించే ఆలోచించాను. ఆమె తిరిగి ఇంటికి వెళ్ళినా, ఆమెకు లభించేది పనిమనిషి స్థానం మాత్రమే! అట్లని ఆమెను ఎక్కడికీ వెళ్ళకుండా, జీవితకాలమంతా ఇక్కడే గడపమనడం అన్యాయం. కనుక, మీకు అభ్యంతరం లేకపోతే ఆమెను నేను పెళ్ళాడి, నా ఇంటికి తీసుకుపోతాను,'' అన్నాడు.



జీవానందుడు, అతడి మాటలకు సంతోషించి, "నాకు అభ్యంతరమేముంటుంది, మాధవా! నిర్మల అభిప్రాయం తెలుసుకోవాలిగదా," అని కుటీరంలోకి వెళ్ళి, అరగంట తర్వాత తిరిగి వచ్చి, "మాధవా! నిర్మల, నీకు తను తగనని సవినయంగా మనవి చేస్తున్నట్టు చెప్పమన్నది. ఆమె, నువ్వు మొదట చూసిన మూగ యువకుణ్ణి పెళ్ళి చేసుకోబోతున్నది." అంటూ తన పక్కనే అరటి ఆకులో చుట్టివుంచిన వేణువొకదాన్ని తీసి మాధవుడికి ఇస్తూ, "దీన్ని నిర్మలకు కాబోయే భర్తయారుచేశాడు. వాళ్ళిద్దరూ దీన్ని నీకు తమ కానుకగా ఇవ్వమన్నారు!" అన్నాడు.

జీవానందుడి మాటలు విన్న మాధవుడు హతాశుడై, చేసేదేమీ లేక మౌనంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తనకెంతగానో సాయపడిన మాధవుణ్ణి కాదని, నిర్మల ఒక మూగవాణ్ణి పెళ్ళాడగోరడం కృతఘ్నతకాదా? ఆమె ఎందుకలా ప్రవర్తించింది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మాధవుడు, నిర్మల విషయంలో మొదటి నుంచీ స్వార్థంగానే ప్రవర్తించాడు. ఆమె ఏడుపు తన గానానికి ఆటంకమైన కారణంగా, ఆమెను ముని దగ్గిరకు చేర్చాడు తప్ప, ఆమె మీది సానుభూతితో కాదు. వికృతాకారిగా వుండగా, ఆమె గురించి తన కేమీ పట్టనట్టు ప్రవర్తించిన వ్యక్తి, రూపు మారగానే వచ్చి పెళ్ళాడతానంటే— ఆత్మాభిమానం గల ఏ ఆడపిల్లా అంగీకరించదు. ఈ కారణాలవల్ల నిర్మల ప్రవర్తనలో కృతఘ్నతాభావం ఏమీ లేదు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : లక్ష్మీగాయత్రి రచన]



## మహనీయులు కలలుగన్న భారతదేశం:

# ఆదర్శ జ్యోతి!

పరాయి పాలననుంచి, మన దేశానికి స్వాతంత్ర్యం సాధించడానికి వేలాది మంది ప్రాణాలు అర్పించారు. 1914 వ సం॥ కొందరు యువకులు ఒక బృందంగా చేరి 'ఘదర్‌పార్టీ' స్థాపించారు. కెనడాలోనూ, జర్మనీలోనూ తమ కార్యాలయాలు నెలకొల్పారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో వాళ్ళు భారతీయ సైన్యాన్ని తిరగబడమని పురికొల్పి ప్రోత్సహించారు. వాళ్ళ ప్రయత్నం విఫలమయింది. పర్యవసానంగా వాళ్ళలో నలభై రెండుమందికి మరణశిక్ష, నూట పద్నాలుగుమందికి దేశబహిష్కారం, తొంభైముగ్గురికి కఠిన కారాగారశిక్ష విధించారు!

ఉరిశిక్షను అనుభవించనున్న యువకులు భారతమాత ఘనతను కీర్తిస్తూ మందహాసంతో ఒక్కొక్కరుగా ఉరికంబం ఎక్కారు. ఉరికంబం ఎక్కడానికి ముందు వాళ్ళందరూ ఇలా ప్రార్థన జరిపారు: "తల్లీ! మేము నీ సంకెళ్ళను ఛేదించలేక పోయాము. మాలో ఏ ఒక్కరు ప్రాణాలతో మిగిలినా, నీ కీర్తి ప్రతిష్ఠలను పరిరక్షించడానికీ, ప్రజల స్వేఛ్ఛాస్వాతంత్ర్యాలనూ, సమతనూ సాధించడానికీ జీవితాంతం కృషి చేస్తాము!"

## మీకు తెలుసా?

1. అయోధ్య రాజధానిగా వెలసిన రాజ్యం ఏది?
2. రాముడి వంశం స్థాపించిన వారెవరు?
3. విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన ఇద్దరు అన్నదమ్ము లెవరు?
4. విజయనగర సామ్రాజ్యం ఎప్పుడు స్థాపించబడింది? దాని రాజధాని ఏది?
5. విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన వారందరిలోకీ ప్రసిద్ధిగాంచిన వారెవరు?

(36 వ పేజీ చూడండి)

# శివుడు

జీవుల సంకటాలను హరించేవాడని కీర్తించబడే శివుడు లయకారకుడు. బ్రహ్మ సృష్టికీ, విష్ణువు స్థితికీ కారకులు. త్రిమూర్తులలో మూడవవాడైన శివుడు సాగించే సంహారం కల్యాణాత్మకం. ఎందుకంటే అదే ప్రపంచ సృష్టికి మూలం; మార్పుకు ఆధారం! శివాంశలోని ఈ దివ్య శక్తిని నటరాజ రూపంలో దర్శించవచ్చు. నటరాజ నృత్యం కాలగమనానికి సంకేతం. అందుకే పరమశివుణ్ణి మహాకాలుడని కూడా అంటారు!

శివుడంటే శుభుడనీ, శాశ్వతుడనీ అర్థాలున్నాయి. శంకరుడు, రుద్రుడు, మహాదేవుడు అన్నవి శివుడి మరికొన్ని నామాలు!

దుర్గామాత శివుడి అర్ధాంగి. ఆమెనే సతీదేవి, ఉమ, పార్వతి అని కూడా అంటారు.

లింగం అంటే సంకేతం అని అర్థం. దివ్య పరిపూర్ణతకు సంకేతంగా రాతి లింగాకారంలో మహాదేవుణ్ణి ఆరాధించడం ఆరంభమయింది!



## ధనికులు సృష్టిస్తూన్న వాతావరణ కాలుష్యం!

ప్రకృతి వనరులను విపరీతంగా వినియోగించే ధనికులే రకరకాల వాతావరణ కాలుష్యాలకు ఎక్కువగా దోహదం చేస్తున్నారని 'వరల్డ్‌వాచ్' పత్రిక తెలియజేస్తున్నది.

కారుడ్రైవర్లూ, మాంసాహారులూ, రకరకాల ఆహారాలను మితిమించి తీసుకునేవాళ్ళూ, వృధా చేసే వాళ్ళూ రకరకాల వాయువులను పుట్టిస్తున్నారు. భూమికి రక్షణగా వున్న 'ఓజోన్ పొర'కు హానికలిగించే క్లోరో ఫ్లూరో కార్బన్ వాయువులో తొంభై శాతం ఇలాగే ఉత్పన్నమవుతున్నదని ఒక అంచనా.



ం కబుర్లు



## బాలమేధావి!

దక్షిణ లండన్ వింబుల్డన్‌కు చెందిన గణేష్ సిర్దంబలం అనే పదకొండేళ్ళ కుర్రాణ్ణి, వారానికోసారి గణిత శాస్త్రాభ్యాసం చేయడానికి సర్రే విశ్వవిద్యాలయం అనుమతించింది। అతని వయసుకు రెట్టింపు ప్రాయంగల విద్యార్థులతోపాటు చదువుకుంటూన్న గణేష్ – ఇతర విషయాలలో అందరిలాగే వున్నా, గణితంలో మాత్రం అసమాన ప్రతిభ కనబరుస్తున్నాడని ఉపాధ్యాయులు అంటున్నారు. ఈ బాలమేధావి తల్లిదండ్రులు కూడా గణిత శాస్త్రజ్ఞులే।

# సాహిత్యావలోకనం

1. మరణశిక్షను పొంది, అది అమలుజరగడానికి ముందు క్షమించబడిన గొప్ప రచయిత ఎవరు ?
2. ఆయన రాసిన ముఖ్యమైన నవలలు ఏవి ?
3. షేక్స్పియర్ నాటకాల సంకలనం మొట్టమొదటిసారిగా ఎప్పుడు ప్రచురించబడింది ?
4. తాను నివసిస్తూన్న నగరానికి తన పేరు పెట్టాలని కోరుకున్న సుప్రసిద్ధ రచయిత ఎవరు ?
5. తన మాతృభాషలో పిల్లలకు కథలు రాసిన సుప్రసిద్ధ భారతీయ చలనచిత్ర దర్శకుడు ఎవరు ?

## సమాధానాలు

**లోకజ్ఞానం**

1. కోసల
2. ఇక్ష్వాకుడు
3. హరిహరరాయలు, బుక్కరాయలు
4. 1336 వ సం॥లో. హంపి
5. కృష్ణదేవరాయలు

**సాహిత్యం**

1. ఫియోదార్ దోస్తోవ్‌స్కీ (1821–81)
2. "బ్రదర్స్ కారమజోవ్" "క్రైమ్ అండ్ పనిష్‌మెంట్" "ఇన్సల్టెడ్ అండ్ ఇన్‌జ్యూర్డ్"
3. 1623 వ సం॥లో.
4. విక్టర్ హ్యూగో
5. సత్యజిత్ రాయ్.

ప్రపంచ పురాణగాథలు - 2

# డేరియస్

పర్షియా యువరాజు స్మెర్‌డిస్‌ను, కొందరు హంతకులు రహస్యంగా హత మార్చారు. ఆ విషయం యువరాజును పోలిన ఒక వ్యక్తికి తెలిసింది. తనే యువరాజు లాగా ఎందుకు నటించ కూడదు? అన్న ఆలోచన వాడికి కలిగింది.

వెంటనే వాడు యువరాజు లాగా వేషం వేసుకుని ఆస్థానానికి బయలుదేరాడు. ప్రజలందరూ వాణ్ణి అసలు యువ రాజనే పొరబడ్డారు. కొన్నాళ్ళకు వాడు రాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు!





అయినా, అసలు విషయాన్ని ఏడుగురు యువకులు గ్రహించి, దొంగరాజుకు వ్యతిరేకంగా తిరుగుబాటు జరిపి, వాణ్ణి గద్దె దింపారు. ఆఖరికి వాడికి మరణ శిక్ష విధించారు!



వాడి మరణానికి సంతసించిన ప్రజలు ఉత్సవం జరుపుకున్నారు. గుణవంతు లయిన ఆ ఏడుగురి యువకులలో ఏ ఒక్కరు రాజుగా వచ్చినా తాము సంతోషంగా అంగీకరించి బలపరచగల మని ప్రజలు హామీ ఇచ్చారు.

ఆ ఏడుగురిలో రాజపదవిని అలంకరించే దెవరు? వాళ్ళు తమలోతాము చర్చించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు. సూర్యోదయం కాగానే ఏడుగురూ గుర్రం మీద స్వారీ వెళ్ళాలనీ, అప్పుడు ఎవరి గుర్రం మొదట సకిలిస్తుందో వాళ్ళే రాజు కావాలనీ తీర్మానించారు.





ఆ ఏడుగురిలో డేరియస్ అనే యువకుడు ధీరోదాత్తుడు. అతని కొక తెలివైన నౌకరు ఉన్నాడు. యువకుల సంభాషణను విన్న ఆ నౌకరు ఒక నిర్ణయం తీసుకున్నాడు. ఆ రోజు సాయంకాలమే అతడు డేరియస్ గుర్రాన్ని తన వెంట తీసుకుపోయాడు.

మైదానంలో ఒక ఈత చెట్టు కింద గుర్రానికి మంచి మేతవేశాడు. గుర్రం తృప్తిగా మేశాక దానిని చావడికి తీసుకు వచ్చి వదిలాడు. ఆ రాత్రి గడిచింది.





మర్నాడు ఉదయమే ఏడు గురు మిత్రులూ తమ అదృష్టాన్ని వెతుక్కుంటూ గుర్రాల మీద బయలుదేరి మైదానం చేరుకున్నారు. సూర్యోదయం అవుతున్నది. వాళ్ళందరూ నెమ్మదిగా ముందుకు సాగారు.

డేరియస్ గుర్రం ఈతచెట్టును సమీపించగానే, నిన్న సాయంకాలం మేసిన మేత గుర్తుకు వచ్చి సంతోషంతో ముందు కాళ్ళెత్తి సకిలించింది!





మరుక్షణమే మిగతా ఆరుగురు మిత్రులూ గుర్రాలు దిగి, అదృష్టవంతుడయిన తమ స్నేహితుడు డేరియస్‌ను రాజుగా భావించి, గౌరవంగా అభినందించారు. తమ నౌకరు చేసిన తంత్రం గురించి, ఏమీ తెలియని డేరియస్— అంతా విధిలిఖితమని భావించాడు.

"డేరియస్ మహారాజుకూ జై," అన్న జయజయ ధ్వానాలతో, అరుగురు మిత్రులూ డేరియస్ వెనక గుర్రాలపై బయలుదేరి తిరిగి నగరం చేరుకున్నారు. ప్రజలు బాటకు ఇరువైపులా చేరారు. తమకు కొత్త రాజు వచ్చాడని ఆనందించారు.





డేరియస్ పర్షియా రాజుగా అభిషిక్తుడయ్యాడు. అతడొక గొప్ప రాజుగా పేరుగాంచాడు. నిజంగానే, డేరియస్ నౌకరు వివేకం ద్వారా విధి పని చేసిందేమో! డేరియస్ నామం చరిత్రలో చిరస్థాయిగా నిలిచింది!



# తెలివైనవాడు

పోలవరం గ్రామంలో నాగన్నా, తాయారమ్మా అనే పేద దంపతు లుండేవాళ్ళు. వాళ్ళకు పాపయ్య ఒక్కడే కొడుకు. వాడికి పదేళ్ళు నిండుతూండగా తల్లిదండ్రు లిద్దరూ విషజ్వరంవల్ల, వారం రోజుల తేడాలో మరణించారు. దానితో పాపయ్య అనాథ అయిపోయాడు.

అయితే, గ్రామస్థులు వాడి మీద దయ తలిచి, రోజూ ఒక ఇంటివాళ్ళు వాడి కింత అన్నం పెడుతూండేవాళ్ళు. క్రమంగా పాపయ్య పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ, గ్రామస్థులు వాడిచేత చిన్న చిన్న పనులు చేయించుకోసాగారు. పాపయ్య ఎవరు చెప్పిన పనీ కాదనలేక, ఒళ్ళు వంచి వాళ్ళు చెప్పే పనులు చేసిపెట్టే, ఊరుమ్మడి నౌకరుగా మారాడు. దానికి ప్రతిఫలంగా గ్రామస్థులు వాడికి తిండి పెట్టేవాళ్ళు.

ఒక్కొక్కసారి ఇద్దరు, ముగ్గురు వచ్చి నా పనికి రా, అంటే నా పనికి రా అని పాపయ్యను పిలిచేవారు. పాపయ్య వాళ్ళల్లో ఏ ఒకరి ఇంటి పనికో వెళ్ళేవాడు. దానితో మిగిలినవాళ్ళు పాపయ్యను నానాతిట్లూ తిట్టి, ఇక పైన మా ఇంట్లో నీకు అన్నం వుండదు, అని బెదిరించి వెళ్ళేవాళ్ళు.

ఇలా కొన్నాళ్ళు గడిచిన తర్వాత, రామయ్య అనే రైతు ఒక రోజున పాపయ్యను పిలిచి, ''ఒరే, నువ్వు ఎంత కాలమని గ్రామంలో వాళ్ళందరికీ అడ్డమైన చాకిరీ చేసి బతగ్గలవు! రేపటి నుంచీ నువ్వు మా ఇంట్లో వుండిపోయి, మా పనులు చేసిపెడుతూ వుండు. నీకు రోజూ మా ఇంట్లోనే అన్నం పెడతాం. తీరుబాటు సమయంలో, మా పిల్లలతో పాటు చదువుకుందువుగాని,'' అన్నాడు.

బైరి సత్యనారాయణ

పాపయ్య అందుకు ఒప్పుకుని, ఆ మర్నాటి నుంచీ రామయ్య ఇంటి పనులు చెయ్యడం ప్రారంభించాడు. ఈ సంగతి తెలిసి గ్రామంలో వాళ్ళు, వాణ్ణి తమ పనులకు పిలవడం మానుకున్నారు.

ఇలా ఒక నెల గడిచేసరికి, పోలయ్య అనే రైతుకు ఒక ఆలోచన వచ్చింది. ఆయన రహస్యంగా పాపయ్యను పిలిచి, "ఒరే, పాపయ్యా! నువ్వెంత పనిమంతుడివి! ఎంత నమ్మకస్థుడివి! అటువంటి నీకు, ఆ రామయ్య నీ కాలేకడుపుకు ఇన్ని గంజినీళ్ళు పోసి, నీ చేత గొడ్డు చాకిరీ చేయించుకుంటున్నాడు. ఇది అన్యాయం! నువ్వు పని చేసేందుకు మా ఇంటికి రా. నీకు కడుపునిండా అన్నం పెట్టి, రోజూ ఒక రూపాయి కూడా ఇస్తాను," అన్నాడు.

ఇందుకు పాపయ్య సరేనని, రామయ్య ఇంట పని మాని, పోలయ్య ఇంటికి వచ్చి వాళ్ళ పనులు చేయసాగాడు. రామయ్య ఉక్రోషంకొద్దీ పోలయ్యనూ, పాపయ్యనూ నానాతిట్లూ తిట్టాడు.

పోలయ్య ఊరి రచ్చబండ దగ్గిర చేరిన పదిమందితో, రామయ్యను గురించి చెప్పి, "రామయ్య, అలా నోరు పారేసుకోవడం ఏం బాగా లేదు. ఇందులో నా తప్పేముంది? ఆ పాపయ్యగాడి మొఖాన పిడికెడు మెతుకులు పారేసి, ఆయన వాడిచేత రాత్రనక పగలన వెట్టిచాకిరీ చేయించుకుంటున్నాడు. నేను వాడికి



సుష్టుగా అన్నం పెట్టడమేకాక, రోజూ ఒక రూపాయి కూడా ఇస్తున్నాను,'' అన్నాడు.

ఇది విని అక్కడ చేరినవాళ్ళలో కొందరు రామయ్య పక్షానా, మరి కొందరు పోలయ్య పక్షానా మాట్లాడడం ప్రారంభించారు. క్రమంగా అది కీచులాటగా తయారైంది.

అప్పుడు గ్రామమునసబు కల్పించుకుని, ''ఒక అనాథ వెధవ కోసం మీలో మీరు కీచులాడుకోవడం ఏమీ బాగా లేదు. ఆ పాపయ్య పుట్టుబానిసేంకాదు గదా?. ఏ ఇంటవాడికి సౌకర్యంగా వుంటే, ఆ ఇంటపని చేస్తాడు,'' అన్నాడు.

''అవును, అంతేగదామరి!'' అన్నాడు గ్రామంలోకెల్లా పెద్దరైతయిన భూషయ్య.

ఆ మర్నాడు భూషయ్య తన పాలేరును పంపి పాపయ్యను తన ఇంటికి పిలిపించి, వాడికి అన్నం పెట్టి నెలకు యాభై రూపాయిలిచ్చేటట్టూ, దాంతోపాటు సంక్రాంతి పండగకు ఒక జత కొత్తబట్టలిచ్చేటట్టూ మాట్లాడి, వాణ్ణి తన పనిలో పెట్టుకున్నాడు.

ఆ సంగతి తెలిసి పోలయ్య రచ్చబండ దగ్గిర, ''ఆ భూషయ్య బాగా వున్నవాణ్ణని మిడిసిపడుతున్నాడు. నా ఇంటి నౌకరయిన పాపయ్యకు లేనిపోని ఆశలు పెట్టి తీసుకుపోతాడా! ఇదేం తెలివైన పని కాదు,'' అన్నాడు కోపంగా.

అక్కడే వుండి, ఆ మాటలు విన్న రామయ్య, ''నువ్వు చేసిన పనేమిటి?



నా దగ్గిరున్న ఆ పాపయ్యగాడికి డబ్బాశ పెట్టి తీసుకుపోయావు గదా. అది తెలివైన పనా?'' అని అడిగాడు.

దానితో పోలయ్య, రెచ్చిపోయి, రామయ్యను తిట్టడం ప్రారంభించాడు. నలుగురూ చేరి వాళ్ళను సర్ది, ఎవరి ఇళ్ళకు వాళ్ళను పంపేశారు.

కొన్నాళ్ళుగా, ఈ జరుగుతున్నదంతా గమనిస్తున్న పాపయ్య, ఆ రాత్రి ఒక ఉత్తరం రాసి, దాన్ని మునసబు ఇంటి కిటికీలోంచి లోపలకు విసిరి, గ్రామం విడిచి ఎటో వెళ్ళిపోయాడు.

తెల్లవారాక మునసబు, ఆ ఉత్తరం చదివి నవ్వుకుని, సాయంకాలం రచ్చబండ దగ్గిరకు వచ్చి, అక్కడ వున్న వాళ్ళతో, ''పాపయ్య ఉత్తరం ఒకటి రాసి, మా ఇంట్లో పడేసి గ్రామం వదిలిపోయాడు. అందులో ఏమున్నదో చదవమంటారా?'' అని అడిగాడు.

చదవమన్నట్టు, అందరూ తలలు ఊపారు.

గ్రామంలోని చిన్నా, పెద్దలందరికీ నమస్కారాలు. నా తల్లీ తండ్రీ పోయాక, అనాధుడనైన నాకు గ్రామంలోని వారందరూ ఇంత అన్నం పెట్టి, ఎంతో ఆప్యాయంగా పెంచి పెద్ద చేసినందుకు కృతజ్ఞుణ్ణి. కానీ ఇప్పటి పరిస్థితి చూస్తే, నావల్ల గ్రామస్థులు ఒకరిపై ఒకరు ద్వేషాన్ని పెంచుకుని, ఒకరినొకరు కత్తులతో పొడుచుకోవడమో, లేక నన్ను కత్తులతో పొడిచి చంపుతారేమో అన్న భయం కలుగుతున్నది. అందువల్ల ఎవరికీ చెప్పకుండా, చీకటిమాటున గ్రామం విడిచి దూరంగా పోతున్నాను.

మునసబు ఈ విధంగా ఉత్తరం చదివి, అందరి ముఖాలకేసీ ఒకసారి పరీక్షగా చూసి, ''పాపయ్య మరి కొంతకాలం గ్రామంలో వుంటే, వాడు ఊహించిన విపత్తు మన గ్రామానికి తప్పేదికాదు. వాడు నిజంగానే మనందరికన్నా తెలివైనవాడు! ఏమంటారు?'' అని అడిగాడు.






ఇతర వానరుల కన్న హనుమంతుడికే కార్యం సాధించే శక్తీ, అవకాశమూ, ఎక్కువగా ఉన్నాయనుకుని సుగ్రీవుడు హనుమంతుడితో ఇలా అన్నాడు:

"మహావీరుడవైన హనుమంతుడా, నువ్వు గాలిలోనూ, నీటిలోనూ, భూమి మీదా, పై ఆకాశంలోనూ కూడా సంచరించగలవాడివి. నీకు తెలియని లోకంగాని, సముద్రంగాని, పర్వతంగాని లేదు. నువ్వు వాయుదేవుడి లాటి గమనమూ, వేగమూ కలవాడివి. భూమి మీద నిన్ను మించిన బలం గల ప్రాణే లేదు. అందుచేత సీతాదేవి తిరిగి దొరికే ప్రయత్నం నీ వల్లనే కావాలి. బలమూ, బుద్ధీ, దేశకాలానుగుణంగా ప్రవర్తించే నేర్పూ, పరాక్రమమూ నీలో ఉన్నట్టుగా మరెవరిలోనూ లేవు."

హనుమంతుడితో సుగ్రీవుడు ఇలా మాట్లాడటం విని రాముడు, కార్యభారాన్ని సుగ్రీవుడు హనుమంతుడి పైన పెట్టుతున్నట్టు గ్రహించాడు. హనుమంతుడి శక్తిసామర్థ్యాలు సుగ్రీవుడికి బాగా తెలిసి ఉండాలి. రాముడి ఆశలన్నీ హనుమంతుడి మీదికి మళ్ళాయి. అతను తన పేరుగల ఉంగరాన్ని హనుమంతుడికి ఇస్తూ, "వానరశ్రేష్ఠుడా, ఈ ఉంగరాన్ని చూసినట్టయితే సీతాదేవి నిన్ను చూసి భయపడదు, అనుమానించదు; నువ్వు నా వద్ద నుంచి వచ్చావని గుర్తిస్తుంది. నీ వల్ల తప్పక పని జరుగు



తుందని సుగ్రీవుడి మాటలను బట్టి నాకు తోస్తున్నది," అన్నాడు.

హనుమంతుడు ఆ ఉంగరాన్ని తీసుకుని, నెత్తి మీద చేతులు పెట్టుకుని నమస్కారం చేసి, రాముడి పాదాలకు ప్రణామం చేసి, బయలుదేరాడు. అతనితో మరొకసారి రాముడు, "హనుమంతుడా, నేను నీ శక్తినే నమ్ముకుని ఉన్నాను. శక్తివంచన లేకుండా పాటుపడి, సీతాదేవి తిరిగి దొరికేటట్టు చూడు," అన్నాడు.

వానరులు మిడతల దండులాగా అన్ని దిక్కులకూ బయలుదేరారు. వాళ్ళు తిరిగి రావటానికి ఒక మాసం మాత్రమే గడువు వున్నది.

వానరులు బయలుదేరిన అనంతరం రామ, లక్ష్మణులు ప్రస్రవణ పర్వతం మీది గుహలో వారు తిరిగి రావటం కోసం ఎదురుచూస్తూ ఉండిపోయారు.

వినతుడి బృందం తూర్పుగానూ, సుషేణుడి బృందం పడమరగానూ, మరికొందరు ఉత్తరంగానూ వెళ్ళగా, హనుమంతుడూ, తారుడూ, అంగదుడూ మొదలైన వాళ్ళు దక్షిణదిక్కుగా బయలుదేరారు. అందరినీ అన్ని దిక్కులకూ పంపి, రాముడికి తాను ఇచ్చిన మాట నిలబెట్టుకున్న సంతృప్తితో సుగ్రీవుడు వెనకటి కన్నా మరింత సుఖంగా జీవించసాగాడు.

సుగ్రీవుడు పంపిన వానరులు సీతాదేవి కోసం చాలా శ్రద్ధగా వెతికారు. వారు ఎక్కడికి వెళ్ళినా పగలల్లా ప్రతి సరస్సూ, నదీ, పొదా, కొండా, గుహా వెతికి, రాత్రికాగానే ఒక చోటికి చేరుతూ, చెట్ల కింద రాత్రి గడుపుతూ ముందుకు సాగారు. తూర్పుగానూ, ఉత్తరంగానూ, పడమరగానూ వెళ్ళిన వానరబలగాల వాళ్ళు నెల గడువు తీరేసరికి తిరిగి వచ్చి, సీతాదేవి జాడ తెలియలేదని సుగ్రీవుడితో చెప్పారు. అప్పుడు సుగ్రీవుడు ప్రస్రవణ పర్వతం మీద రాముడితో కూర్చుని ఉన్నాడు.

అయినా, ఇంకా ఆశ ఉన్నది. దక్షిణంగా వెళ్ళిన బృందం ఇంకా తిరిగి రాలేదు. సీతను తీసుకుపోయిన రావణుడు దక్షిణ దిక్కుగానే వెళ్ళాడు. అందుచేత హనుమంతుడు సీతను చూసి వచ్చే అవకాశం ఉన్నది.

ఈ లోపుగా హనుమంతుడు మొదలైన వాళ్ళు సీత కోసం వెతుకుతూ వింధ్య పర్వత ప్రాంతాన్ని చేరుకున్నారు. అది చాలా విస్తృతమైన ప్రదేశం. అక్కడ ఎన్నో గుహలున్నాయి. శిఖరాలున్నాయి. అరణ్యాలున్నాయి. దాటటానికి కష్టమైన నదులున్నాయి. చాలా ఎత్తయిన చెట్లున్నాయి. పళ్ళూ, దుంపలూ తింటూ వానరులు ఆ ప్రాంతంలో ఒక్కొక్క ప్రదేశమే సీతాదేవి కోసం వెతుకుతూ ముందుకు వెళ్ళారు.

ఒక ప్రదేశం బొత్తిగా శూన్యంగా ఉన్నది. అక్కడ చెట్లు నిలువునా ఎండి ఉన్నాయి. నదులలో నీరులేదు. లతలూ, పుష్పాలూ, దుంపలూ లేవు. ఎలాటి జంతువులు గాని, పక్షులు గాని లేవు. ఆ ప్రదేశం భయంకరంగా ఉన్నది.

ఆ వనంలో కండుమహర్షి ఉండేవాడు. ఆయనకు తపోబలం ఎంత ఎక్కువో, కోపం కూడా అంత ఎక్కువ. తన కొడుకు పదహారేళ్ళవాడు అకాలమరణం పొందే



సరికి, ఆయన ఆ వనాన్ని శపించి ఎడారిగా చేశాడు. వానరులు ఆ శూన్యప్రదేశంలో కూడా సీతాదేవి కోసం శ్రద్ధగా వెతికారు.

అలా వెతుకుతూ వాళ్ళు ఒక భయంకరమైన అరణ్యం గల ప్రదేశంలో ప్రవేశించారు. అక్కడ వాళ్ళకు ఒక రాక్షసుడు కనిపించాడు. మహాకాయుడైన ఆ రాక్షసుణ్ణి చూస్తూనే వానరులు దట్టీలు బిగించి, వాడితో యుద్ధానికి సిద్ధపడ్డారు.

వాడు కూడా వానరులను చూస్తూనే, "మిమ్మల్నందరినీ చంపేస్తాను," అంటూ పిడికిలి బిగించి వారి మీదికి వచ్చాడు. అంగదుడు వాణ్ణి చూసి, వాడే రావణుడు అయి ఉంటాడనుకుని, వాడి నెత్తి మీద



బలంగా కొట్టాడు. ఆ ఒక్క దెబ్బకే ఆ రాక్షసుడు నెత్తురు కక్కుతూ, నేల మీద పడిపోయి, ప్రాణాలు వదిలాడు.

రావణుడు చచ్చాడనీ, సీత వాడి గుహ లోనే ఉంటుందనీ అనుకుని, వానరులు వాడి గుహ అంతా శ్రద్ధగా వెతికి చూశారు. అక్కడ సీత లేదు. వానరులు దాని సమీపంలో గల మరొక పెద్ద గుహ కూడా వెతికారు; ఆ అరణ్యమంతా వెతికారు. ఎక్కడా సీత కనిపించకపోయేసరికి, వాళ్ళు నిస్పృహ చెంది, ఒక చెట్టు కింద చేరి కూర్చున్నారు.

అప్పుడు అంగదుడు వాళ్ళతో, "మనం ఇంత కాలంగా ఎన్నో అరణ్యాలూ, నదులూ, పర్వతాలూ, గుహలూ ఎంతో శ్రమపడి వెతుకుతున్నా, మనకు సీత జాడగాని, ఆమెను ఎత్తుకుపోయిన రావణుడి జాడగాని తెలియరాలేదు. సుగ్రీవుడి ఆజ్ఞ మహా దారుణమైనది. మనం నిరుత్సాహపడి పని చెయ్యలేం. సోమరితనం పనికిరాదు. మరొకసారి ఈ వనం అంతటా వెతకండి. మీరంతా ఇప్పుడు నిద్రపోవటం భావ్యం కాదు. లేదా, ఇంకా మంచిపద్ధతి ఏమైనా ఉంటే చెప్పండి." అన్నాడు.

గంధమాదనుడు కూడా అంగదుడు చెప్పినట్టే చెప్పాడు.

అప్పుడు వానరులు తమ అలసటను మరిచిపోయి, తిరిగి వింధ్యపర్వతారణ్యాలలో సీత కోసం వెతకటం ఆరంభించారు. వాళ్ళు వెండి కొండలాటి ఒక శిఖరం ఎక్కి, అక్కడ కూడా సీతను చూడలేక పోయారు. తరవాత వాళ్ళు ఆ శిఖరం నుంచి దిగివచ్చి, కొంతసేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ వెతకటం ప్రారంభించారు. వాళ్ళు వింధ్యపర్వతం మీద సీత కోసం వెతుకుతూ ఉండగానే సుగ్రీవుడు పెట్టిన నెల గడువు దాటిపోయింది.

వానరులు ఒక్కొక్క ప్రదేశాన్నే వెతుకుతూ వింధ్యపర్వతపు నైరృతి కొసకు చేరుకున్నారు. ఇక్కడికి చేరిన

వానరులలో ప్రముఖులు హనుమంతుడూ, గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, సుషేణుడూ, జాంబవంతుడూ, నళుడూ, యువరాజు అంగదుడూ, తారుడూ ఉన్నారు.

వాళ్లు ప్రతి గుహలోనూ చూసుకుంటూ ఒక పెద్ద బిలం వద్దకు వచ్చారు. అది ఋక్షబిలం. దాన్ని మయుడు నిర్మించాడు. దానికి లతలు అడ్డంగా పెరిగి ఉండి ప్రవేశించ రాకుండా ఉన్నది. వానరులు ఆకలి, దప్పులతో అలమటించి పోతున్నారు. ఆ ప్రాంతాల ఎక్కడా నీరు లేదు. వాళ్ళు చాలా అలసిపోయి కూడా ఉన్నారు.

అయితే వాళ్ళకు, ఋక్షబిలం నుంచి క్రౌంచపక్షులూ, హంసలూ, బెగ్గురు పక్షులూ, చక్రవాకాలూ మొదలైన నీటి పక్షులు బయటికి ఎగురుతూ రావటం కనిపించింది. అది చూసి హనుమంతుడు మొదలైన వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు. వాళ్ళు ఆ బిలాన్ని సమీపించారు.

పర్వతాలను గురించీ, అరణ్యాలను గురించీ విశేషంగా తెలిసినహనుమంతుడు మిగిలిన వారితో ఇలా అన్నాడు:

"చూడండి, ఈ గుహాముఖం నుంచి నీటి పక్షులు ఎగురుతూ వస్తున్నాయి. దీని ద్వారంలో ఉన్న లతలూ, చెట్లూ నేవళంగా ఉన్నాయి. లోపల నీరు గల బావిగాని, చెరువుగాని ఉన్నదనటానికి





సందేహం లేదు. మనమా, దాహంతో బాధ పడుతూ, చాలా డస్సి ఉన్నాం.''

హనుమంతుడు ఈ మాట అనగానే వానరులు బిలంలోకి ప్రవేశించారు. లోపల కన్ను పొడుచుకున్నా కానరానంత చీకటిగా ఉన్నది. వానరులు తాము ఎటు పోతున్నదీ కూడా తెలియకుండా, తడువుకుంటూ ముందుకు పోయారు. పోగా, పోగా చీకటి పోయి, కాంతి వచ్చింది. తరవాత అమిత అందమైన ప్రదేశం వారికి కనబడింది. అక్కడ ప్రకాశవంతమైన కాంచనవృక్షాలూ, మద్దిచెట్లూ, తాటిచెట్లూ, సురపొన్న చెట్లూ, అశోక వృక్షాలూ, చంద్రచెట్లూ మొదలైనవి ఉన్నాయి. కొన్ని చెట్లూ, కాయలూ, పూలూ కాంతులు వెదజల్లుతున్నాయి. అక్కడ ఒక తామరకొలనులో బంగారు తామరలూ, బంగారు చేపలూ, బంగారు తాబేళ్ళూ ఉన్నాయి.

ఆ ప్రదేశంలో గొప్ప ఇళ్ళు కూడా ఉన్నాయి. వాటి కిటికీలు బంగారువి; కప్పులు బంగారంతోనూ, వెండితోనూ చేసినవి. ఆ ఇళ్ళలో ముత్యాల తోరణాలు కట్టి వున్నాయి; మణులు అలంకరించి ఉన్నాయి.

ఆ ప్రదేశంలో వానరులకు పగడపు కాంతిగల చెట్ల మీద పూలూ, పళ్ళూ కనిపించాయి; రత్నాలు తాపిన బంగారు కుర్చీలూ, మంచాలూ, వాహనాలూ కనిపించాయి. అక్కడక్కడ బంగారు, వెండి, కంచుపాత్రలు రాసులు రాసులుగా ఉన్నాయి. అలాగే అగరూ, చందనమూ, పళ్ళూ, దుంపలూ, పానీయాలూ, తేనే, వస్త్రాలూ, కంబళాలూ, రకరకాల చర్మాలూ, బంగారమూ కుప్పలు కుప్పలుగా కనిపించాయి.

వానరులు ఆ ప్రదేశమంతా వెతుకుతూ ఒకచోట ఒక స్త్రీని చూశారు. ఆమె జింకచర్మం కట్టుకుని, తపస్సు చేసుకుంటున్నది. ఆమె ముఖం అద్భుతమైన ప్రకాశంతో వెలిగిపోతున్నది. అది

చూసి వానరులు ఆశ్చర్యమూ, భయమూ కలిగి ఆగిపోయారు.

హనుమంతుడు ఆమెను, "నువ్వు ఎవరు? ఈ బిలం ఎవరిది?" అని అడిగాడు. చేతులు జోడించి ఆమెకు నమస్కారం చేస్తూ, అతను ఇంకా ఇలా అన్నాడు:

"మేం మార్గాయాసంతో అలసిపోయి, ఆకలి దప్పులతో బాధపడుతూ, ఇక్కడ నీరూ, తిండీ దొరుకుతాయన్న నమ్మకంతో, చీకటి కోణం లాగా ఉన్న ఈ బిలంలో ప్రవేశించాం. కాని ఇక్కడ ఉండే ఈ అద్భుతమైన వస్తువులన్నీ చూస్తే ఇదేదో రాక్షసమాయ లాగా కనబడుతున్నది. ఈ బంగారు చెట్లూ, ఈ బంగారు, వెండి, ఇళ్ళూ ఎవరివి? ఈ కొలనులో ఉన్న బంగారు తామరలను ఎవరు సృష్టించారు? బంగారు తాబేళ్ళూ, బంగారుచేపలూ ఎవరి కల్పన? మాకు ఇదంతా అయోమయంగా ఉన్నది. మాకు కాస్త తెలియజెప్పు."

హనుమంతుడికి ఆ తపస్విని ఇలా సమాధానం చెప్పింది:

"మయుడు అనే గొప్ప దానవుడు ఇక్కడ ఉండేవాడు. అతను దానవుల విశ్వకర్మ. అతని మాయాబలం వల్ల ఈ బంగారు వృక్షాల వనం ఏర్పడింది. అతను గొప్ప తపస్సు చేసి, సమస్తమైన ధనమూ బ్రహ్మ నుంచి వరంగా పుచ్చుకున్నాడు. అతను హేమ అనే అప్సరతో



ఈ ప్రదేశంలో సుఖంగా ఉంటూండగా ఇంద్రుడు అలిగి, మయుణ్ణి వజ్రాయుధంతో కొట్టాడు. తరవాత బ్రహ్మ ఈ ప్రదేశాన్ని హేమకు ఇచ్చాడు. నేను మేరు సావర్ని కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. హేమకు చెందిన ఈ ప్రదేశాన్ని రక్షిస్తూ, నేను ఇక్కడ ఉంటున్నాను. హేమ నా స్నేహితురాలు. ఆమె సంగీత, నృత్యాలలో సమర్థురాలు. ఆమె నాకిచ్చిన వరం మూలాన నన్ను ఎవరూ జయించలేరు. మీరు ఏ కారణంచేత ఈ ప్రాంతాల తిరుగుతున్నారు? ప్రవేశించటానికి సాధ్యం కాని ఈ ప్రదేశానికి ఎందుకు వచ్చారు? మీరు ముందు పళ్ళు తిని, నీరు తాగి, మీ వృత్తాంతం నాకు సవిస్తరంగా చెప్పండి."

హనుమంతుడు ఏమీ దాచకుండా స్వయంప్రభకు జరిగినదంతా వివరంగా చెప్పాడు. చివరకు అతను ఆమెతో, "అమ్మా, నువ్వు మాకు తిండి పెట్టి మా ప్రాణాలు నిలబెట్టావు. ఇందుకు మేం ఏం ప్రత్యుపకారం చెయ్యగలమో చెప్పు," అన్నాడు.

"చాలా సంతోషం! నాకు మీ నుంచి ప్రత్యుపకారం ఏమీ అవసరం లేదు," అన్నది స్వయంప్రభ.

"అమ్మా, ఇప్పటికే మాకు సుగ్రీవుడు ఇచ్చిన గడువు దాటింది. ఈ బిలం నుంచి మేము శీఘ్రంగా బయట పడేటట్టు చూడు. మమ్మల్ని కాపాడు. మేం ఇక్కడ చిక్కుకుపోతే, సీతను వెతికే పని నిలిచిపోతుంది," అన్నాడు హనుమంతుడు.

దానికి స్వయంప్రభ, "నేను నా తపశ్శక్తితో మిమ్మల్ని బయటికి పంపిస్తాను. మీరందరూ కళ్ళు మూసుకోండి," అన్నది.

వానరులందరూ వేళ్ళతో కళ్ళు మూసుకుని, మరుక్షణమే బిలం వెలుపల ఉన్నారు! అప్పుడు వారి వెంట ఉన్న స్వయంప్రభ వారితో, "ఇది వింధ్య పర్వతం. అది సముద్రం. మీకందరికీ శుభం కలుగుగాక!" అని తిరిగి వెళ్ళిపోయింది.





# పేదవరుడు

సీతారామయ్య పేద రైతుగా జీవితం ప్రారంభించి స్వయంకృషితో గొప్పవాడై డబ్బు బాగా కూడబెట్టాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురు రాధ. ఆమె చిన్నతనం నుంచీ పెద్దలపట్ల వినయ విధేయతలతో మసులుతూ అన్ని విద్యలూ నేర్చుకున్నది.

రాధకు పెళ్ళీడు రాగానే ఎక్కడెక్కడి నుంచీ సంబంధాలు వెతుక్కుంటూ వస్తున్నాయి. ఎందుకంటే రాధ అందంలో అప్సరస కూడా. అయితే సీతారామయ్య మాత్రం, తన కూతుర్ని ఎట్టిపరిస్థితుల్లోనూ పేదవారింట ఇవ్వనని స్పష్టం చేశాడు.

ఈ విషయం తెలిసి పక్క గ్రామంలోని విజయుడనేవాడు, రాధను పెళ్ళి చేసుకోవాలని మోజుపడ్డాడు. విజయుడు కోటీశ్వరుడు. ఊళ్ళో సగం పొలాలు వాడివే. పైగా, నాలుగు దుకాణాలు, వడ్డీ వ్యాపారం, మూడు మేడలు వున్నాయి.

తనకంటే డబ్బున్నవాడు చుట్టుపక్కల వుండడన్న గర్వంతో, వాడు ఒక పెళ్ళిళ్ళ పేరయ్యను పిలిచి, ''నాకు ఇంత డబ్బున్నా అందం, గుణం, చదువు వున్నాయని నేను రాధ అంటే ఇష్టపడ్డాను. లక్షవరహాలు కట్నమిస్తే చాలు, రాధను పెళ్ళి చేసుకుంటాను. పెళ్ళి సంబంధం కుదుర్చు. సీతారామయ్య మరీ లక్షవరహాలు ఇవ్వలేనని అంటే, ఎనభై వేల వరహాలకు ఒప్పించు. నువ్వు నాకు ఈ సాయం చేస్తే, నీకు వెయ్యి వరహాలు బహుమతిగా ఇస్తాను,'' అన్నాడు.

వెయ్యివరహాలు వస్తాయన్న ఉత్సాహంతో పేరయ్య, అప్పటికప్పుడే సీతారామయ్య ఇంటికి వెళ్ళి విజయుడి గురించి చెప్పాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

సీతారామయ్య పెదవి విరిచి, "ముందే చెప్పాను. మా అమ్మాయిని పేదవాళ్ళింట ఇవ్వదల్చుకోలేదు," అన్నాడు.

పేరయ్య తెల్లబోయి, "విజయుడు మీకంటే ఏ విధంగానూ పేదవాడు కాదు. లక్షవరహాలు కట్నమివ్వడం ఇష్టం లేక, మీరతణ్ణి చిన్నబుచ్చడం మర్యాదకాదు," అన్నాడు.

సీతారామయ్య దీనికి బదులివ్వలేదు. పేరయ్య కోపంగా, "ఇంతకంటే గొప్ప సంబంధం ఎక్కణ్ణించి తెస్తారో చూస్తాను," అని వెళ్ళిపోయాడు.

కానీ నిజంగానే అంతకంటే గొప్ప సంబంధం వెతుక్కుంటూ సీతారామయ్య ఇంటికి వచ్చింది. వరుడి పేరు అజయుడు. పదికోట్ల ఆస్తికి ఒక్కగానొక్క వారసుడు. పట్నంలో రత్నాల వ్యాపారం వున్నది. అజయుడు మనిషి కూడా విజయుడి కంటే ఎంతో అందంగా వుంటాడు. గతంలో విజయుడు లక్షవరహాలు కట్నంగా అడిగితే కాదన్నాడని, అజయుడు యాభై వేల వరహాలు కట్నంగా ఇస్తే చాలన్నాడు.

అజయుడి నుంచి ఈ కబురు తీసుకుని వివాహాల వీరయ్య అనేవాడు వచ్చాడు. కానీ సీతారామయ్య, వీరయ్యకు కూడా పేరయ్యకు చెప్పినట్లే చెప్పాడు.

వీరయ్య ఆశ్చర్యపోయి, "అవునూ, నువ్వు అజయుణ్ణి పేదవాడనడానికి. అసలు నీకున్నదెంత? నీ ఆశపోతుతనం వల్ల, నీ కూతురికి పెళ్ళి కాకుండా



పోగలదేమో జాగ్రత్త! ఏ మహారాజో మోజుపడి వచ్చి, నీ కూతుర్ని చేసుకుంటాడని ఆశపడుతున్నావేమో! ఆశకు అంతుండాలి,'' అని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు, ఆ గ్రామంలోనే వుండే వినయుడనేవాడు సీతారామయ్యను కలుసుకుని, ''నేను మీ అమ్మాయి రాధ అంటే ఇష్టపడుతున్నాను. మీరు ఒప్పుకుంటే ఆమెను పెళ్ళి చేసుకుంటాను. ఆమెకు నేనంటే ఇష్టమేనని ముందే తెలుసుకున్నాను,'' అన్నాడు.

సీతారామయ్య వాడితో, ''నాకు పది లక్షల వరహాల రొక్కముంది. ఇరవై ఎకరాల పొలముంది. లక్షవరహాలు విలువ చేసే నగలున్నాయి. కానీ ఇవేమీ నా కూతురు కివ్వలేను. వృద్ధాప్యంలో ఏ మనిషికైనా ఆసరాగా వుండేది డబ్బు మాత్రమే! ఈ డబ్బు, ఆస్తి నేను నా వృద్ధాప్యం కోసం దాచుకుంటున్నాను. అయితే—నా కూతురు నా ఇంట్లో ఎంతో సుఖంగా బ్రతుకుతున్నది. ఆమెను అంత సుఖంగానూ ఉంచగల భాగ్యవంతుడికే ఇచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నాను. నీ ఆస్తిపాస్తుల గురించి చెప్పు,'' అన్నాడు.

''అయ్యా, నాలుగేళ్ళ క్రితం నేనీ ఊరు వచ్చి, నాలుగు పాడిగేదెలతో పాల వ్యాపారం ప్రారంభించాను. ఇప్పుడు నావద్ద పది పాడిగేదె లున్నాయి. నాలుగెకరాల పొలం కొన్నాను. అప్పుచేసి సొంత ఇల్లు కూడా కట్టాను. దైవం అనుకూలిస్తే,



ఇంటి మీది అప్పు ఈ ఏడాదికి తీరి పోగలదు. నేను మీ అమ్మాయిని సుఖ పెట్టగలనని నమ్ముతున్నాను. అంతేకాదు. వృద్ధాప్యంలో డబ్బొక్కటే ఆసరా అవుతుందని మీరు పొరబడుతున్నారు. కానీ డబ్బు పాపిష్టిది. ముసలితనంలో మిమ్మల్ని అసహాయుల్నిచేసి, అందరూ మీ డబ్బును కాజేయాలనుకుంటారు. కాబట్టి మీరు మీ డబ్బును సత్కార్యాలకు వినియోగించి వదిలించుకోండి. తర్వాత నా దగ్గిరకు వచ్చి వుండండి. నావద్ద మీరు సుఖసంతోషాలతో వుండగలరని నమ్మగలరు." అన్నాడు వినయుడు.

సీతారామయ్య, వినయుడికి రాధ నివ్వడానికి అంగీకరించాడు.

ఈ విషయం తెలిసి పేరయ్య, వీరయ్య వినయుణ్ణి కలుసుకుని, "బాబూ! మేము తెచ్చిన పెద్ద పెద్ద సంబంధాలన్నీ పేదవని, ఆ సీతారామయ్య నిన్నెన్నుకున్నాడు. నీ దగ్గిరగానీ తరగని నిధి ఏమైనా వున్నదా?" అని అడిగారు.

దానికి వినయుడు నవ్వి, "విజయుడు, రాధను పెళ్ళి చేసుకునేందుకు లక్ష వరహాలడిగాడు. అజయుడు యాభైవేల వరహాలడిగాడు. ఆ విధంగా, సీతారామయ్య డబ్బిచ్చేవాడు, వాళ్ళు పుచ్చుకునేవాళ్ళు అయ్యారు. అంటే, వాళ్ళు సీతారామయ్య కంటే పేదవాళ్ళు. పెళ్లికి కట్నమడిగేవాడు బిచ్చగాడితో సమానం. బిచ్చగాడు పేదవాడేకదా! నేను రాధంటే ఇష్టపడి, ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. ఆమెకు నేనివ్వగల సుఖసంతోషాల గురించి చెప్పాను. సీతారామయ్య నేమీ డబ్బడగలేదు సరికదా, ఆయనను కూడా పోషించడానికి సిద్ధంగా వున్నట్లు చెప్పాను. ఆ విధంగా నేనాయనకంటే ధనికుడినయ్యాను. కాదంటారా?" అన్నాడు.

పెళ్ళికి కట్నమడిగేవాళ్ళందరూ పేదవరులేనన్న,సీతారామయ్యఅభిప్రాయాన్ని అంతవరకూ గుర్తించలేనందుకు పేరయ్య, వీరయ్య సిగ్గుపడి, వినయుడి ఔన్నత్యాన్ని మెచ్చుకుని వెళ్ళిపోయారు.





# చంద్రహారం

ఒక ఊళ్ళో దమ్మిడీల గోపయ్య అనే లోభి ఉండేవాడు. సుఖంగా బతకటానికి తగినంత ఉండికూడా గోపయ్య పేదవాడి లాగా ప్రతిదమ్మిడీ పోగుచేసేవాడు.

ఒకనాడు పొరుగింటి పున్నయ్య తన భార్యకు అయిదువందలు పెట్టిచంద్రహారం చేయించాడు. పున్నయ్య భార్య ఆ చంద్రహారాన్ని మెళ్లో వేసుకునిఒకసారి ఊరంతా చుట్టివస్తూ గోపయ్య భార్య సుందరమ్మకు కూడా కనబడి వెళ్ళింది. దానిని చూసి అటువంటి చంద్రహారం తనకు కూడా కొని పెట్టితీరాలని సుందరమ్మ పట్టుబట్టింది.

"ఎందుకే, డబ్బుదండగ! కూటికా గుడ్డకా? అయిదువందలు పెడితే ఎకరం పొలం వస్తుంది, రెండు జతల ఎడ్లు వస్తాయి!" అని గోపయ్య అన్నాడు.

"పున్నయ్యమనకన్న ఉన్నవాడు కాడు. మనకు పిల్లాపీచూ లేదుగాని, వాళ్ళకు నలుగురు పిల్లలుకూడానూ. పున్నయ్య తన భార్యకు చంద్రహారం చేయించి పెట్టాడు. నాకు మీరు ముక్కుపుడకైనా చేయించరు!" అన్నది సుందరమ్మ.

గోపయ్యకు కోపంవచ్చి పున్నయ్యను తిట్టాడు. కాని, భార్య అడిగిన చంద్రహారం కొనటానికిమటుకు ఒప్పలేదు.

తన మెళ్ళో చంద్రహారం వేసుకుంటే చూసి, భర్త మెత్తపడతాడేమోనని సుందరమ్మ, పున్నయ్య భార్యవద్ద చంద్రహారం ఒకరోజు అరువుతీసుకుని తన మెడలో వేసుకుని, భర్తవద్దకు వచ్చి, "ఏమండీ ఎలావుంది?" అని అడిగింది.

గోపయ్య తన భార్యమెడకేసి చూసి క్షణంపాటు ఆనందించాడు. కాని తనను చంద్రహారం చేయించమంటుందేమోననే భయంతో, "బాగానే వుందిగాని, అంత ఖరీదైన వస్తువు మన కెందుకే? దొంగలు

ఎత్తుకుపోగలరు. వేగిరం వెళ్ళి వాళ్ళ నగ వాళ్ళకు ఇచ్చేసిరా!" అన్నాడు.

"బోలెడంత పనివుంది. రేపుదయం ఇచ్చేస్తాను." అన్నది సుందరమ్మ.

ఆ రాత్రి గడిచిపోయింది. తెల్లవారగానే సుందరమ్మ ఆదుర్దాగా తన భర్త దగ్గిరికి వచ్చి, "ఏమండీ, మీరుగాని పొరబాటున ఒక రాత్రివేళ దొడ్డివాకిలి తలుపు తెరిచి పెట్టారా?" అని అడిగింది.

"లేదే? దొంగలు రాలేదుకద? వాళ్ళ చంద్రహారం ఇచ్చేశావా?" అని గోపయ్య ఆదుర్దాపడ్డాడు.

"చంద్రహారం బొట్టుపెట్టెలో దాచాను లెండి. ఇంట్లో ఏమీ పోయినట్టు లేదు." అంటూ సుందరమ్మ బొట్టుపెట్టె తెరిచి చూసింది. అందులో చంద్రహారం లేదు. సుందరమ్మ శోకాలు ప్రారంభించింది.

"బుద్ధితక్కువదానా! అంత ఖరీదైన వస్తువు అప్పుడే తిరిగి ఇచ్చుకోరూ? ఇప్పుడయిదువందలూ ధారపోసి నగ చేయించి వాళ్ళకు ఇవ్వాలికద!" అన్నాడు.

"మీరు దొడ్డితలుపు మూయకుండా పెడతారన్ని నేను కలగన్నానా?" అన్నది సుందరమ్మ.

"నే నా తలుపు తెరిచినట్టు నాకు జ్ఞాపకంలేదు," అన్నాడు భర్త.

ఏమయినా, గోపయ్యకు అయిదు వందలు ఖర్చుచేసి మరో చంద్రహారం చేయించక తప్పింది కాదు.

దాన్ని తెచ్చి భార్యకుయిస్తూ, "వేగిరం దీన్ని తీసుకుపోయి పున్నయ్యగారింట్లో ఇచ్చిరా! అయినశాస్తి చాలు!" అన్నాడు.

సుందరమ్మ నవ్వుతూ, చంద్రహారం తీసుకొని మెడలో వేసుకుని, "ఇది మనదే లెండి. నేను చంద్రహారం బొట్టుపెట్టెలో పెట్టలేదు. చందుగాయి పెట్టెలో పెట్టి పొరబడ్డాను. అది తరవాత కనబడితే ఆరోజునే దాన్ని పున్నయ్యగారింట ఇచ్చేశాను. కనక మనం ఏమీ చేయించియివ్వనవసరం లేదు," అన్నది.

భార్య గడుసుతనానికి గోపయ్య నివ్వెరపోయి, ఏమాటా అనలేకపోయాడు.



# నమ్మకం!

వీరాపురంలోని పెంచలయ్య ఎవరైనా తుమ్మితే, ఎంత ముఖ్యమైన పనినైనా వాయిదా వేసే వాడు. తుమ్ము అరిష్టదాయకం అని, అతడి నమ్మకం. అతడి తండ్రి గోవిందయ్య, "ఒరే! ముసలివాడినైన నాకే ఇంత చాదస్తం లేదు. నీకెందుకురా!" అనేవాడు.

ఒకసారి పెంచలయ్యకు పట్నంలో, ఒక ముఖ్యమైన పని పడింది. సరిగ్గా బయలుదేరుతూండగా అతడి కొడుకైన గోపాలం—పదకొండేళ్ళవాడు తుమ్మాడు.

పెంచలయ్య వాణ్ణి కొరకొరచూస్తూ, "సరిగ్గా సమయానికే తుమ్మాలా, వెధవా?" అన్నాడు.

"తుమ్ము వచ్చింది, తుమ్మాను. నేను తుమ్మితే, నువ్వు ఆగడం దేనికి?" అని అడిగాడు గోపాలం అమాయకంగా.

"తుమ్ము అనర్థదాయకం. తుమ్మిన వెంటనే పని మొదలుపెడితే, అది సఫలం కాదు," అన్నాడు పెంచలయ్య.

"మరి ఇదే సమయానికి మన ఊళ్ళో బోలెడంతమంది తుమ్ముతూ వుండవచ్చు కదా! అవి లెక్కలోకి రావా?" అన్నాడు గోపాలం.

పెంచలయ్య వినుక్కుని, "అవన్నీ లెక్కలోకి తీసుకుంటే పనులు సాగవు. మనకు వినిపించే తుమ్ములే మనకు లెక్క," అన్నాడు.

గోపాలం నవ్వి, "అయితే, తాతయ్య చాలా అదృష్టవంతుడన్న మాట!" అన్నాడు.

"అదేమిటి?" అన్నాడు పెంచలయ్య ఆశ్చర్యపడి.

దానికి గోపాలం, "అవునుమరి! తాతయ్యకు బ్రహ్మచెవుడు గదా! ఎవరి తుమ్ములూ వినబడవు. ఏ బాదరబందీ లేకుండా స్వేచ్ఛగా తన పనులు తాను చేసుకుంటున్నాడు. నీకు స్వేచ్ఛలేదు! కేవలం ఒక తుమ్ము నిన్ను కట్టిపారవేయగలదు," అన్నాడు.

పెంచలయ్యకు ఈ మాటలు చురకల్లాగ తగిలాయి. ఆ తర్వాత అతడు తుమ్ములను పట్టించుకోవడం మానేశాడు.

—వక్కలంక 'కిషోర్'





# ఉత్తమపుత్రుడు

చైనాదేశంలో ఒక పురాతన పట్టణం ఉండేది. ఆ పట్టణంలో హ్యూయెన్ అనే ఒక ధనికుడు ఉండేవాడు. వాడు చాలా దుర్మార్గుడు. ఎవరిపైన అయినా వాడికి కోపం వచ్చిందంటే వాళ్ళ పని పట్టించాడన్న మాటే. డబ్బున్నవాడు కాబట్టి, తన మనుషులను ఉసిగొలిపి, తన కోపానికి గురయినవాళ్ళను హింసించేవాడు. కొందరిని హత్య కూడా చేయించేవాడు.

ఆ పట్టణంలోనే వాంగ్ అనే పేదవాడొకడు ఉండేవాడు. పేదవాడయినప్పటికీ వాంగ్ చాలా ధైర్యవంతుడు. హ్యూయెన్ చేస్తూన్న అక్రమాలను చూసి సహించలేక వాడు రాజు దగ్గిరికి వెళ్ళి హ్యూయెన్‌ను మందలించమని ప్రార్థించాడు.

రాజు వాంగ్ మాట పట్టించుకోలేదు. ఆ ధనికుడిపట్ల పగకొద్దీ అలా ఫిర్యాదు చేస్తున్నాడని అపోహపడ్డాడేగాని, నిజమేమిటో తెలుసుకోవడానికి రాజు ప్రయత్నించలేదు. పైగా, "ఇటువంటి చాడీలు చెప్పావంటే శిక్షిస్తాను," అని వాంగ్‌ను హెచ్చరించాడు.

పేదకోపం పెదవికి చేటు అన్నట్టయింది వాంగ్ పని. ఇక చేసేదిలేక అతడు ఇంటికి తిరిగి వస్తూండగా, "అయ్యో! అమ్మో!" అన్న కేకలు వినిపించాయి.

వాంగ్ అక్కడికి వెళ్ళి చూస్తే, హ్యూయెన్ ఒక వృద్ధురాల్ని కొరడాతో కొడుతున్నాడు. వాడు పళ్ళు బిగించి, "ఇరవైనాలుగు, ఇరవై అయిదు...." అని దెబ్బలను లెక్కపెడుతూ కొట్టడం చూసేసరికి వాంగ్ పట్టరాని కోపావేశంతో, అక్కడ పడివున్న ఒక గునపం తీసుకుని హ్యూయెన్ గుండెలో ఒక్క పోటు పొడిచాడు. హ్యూయెన్ కిందపడి విలవిలా తన్నుకుని ప్రాణాలు వదిలాడు.

చైనా జానపద కథ

కోపంతో అంతపని చేశాడే తప్ప. ఆ కోపం చల్లారడంతో వాంగ్ తను చేసిన పనికి పశ్చాత్తాప పడ్డాడు. అక్కడి నుంచి మళ్ళీ తిన్నగా రాజు దగ్గరికి వెళ్ళి. "ప్రభూ! నేను హ్యూయెన్‌ను చంపే శాను. నాకు తగిన శిక్ష విధించండి!" అన్నాడు.

"ఒక ధనికుణ్ణి ఎందుకూ కొరగాని ఒక పేదవాడు హత్య చేయడమా! నీకు మరణదండన విధిస్తున్నాను!" అన్నాడు రాజు ఆగ్రహంతో.

మరణదండన నెరవేరడానికి రెండు రోజులముందు, వాంగ్ స్నేహితులూ, మరి కొందరు పెద్దలూ రాజును దర్శించి, "ప్రభూ వాంగ్ చాలా మంచివాడు. చని పోయిన హ్యూయెన్ పరమ దుర్మార్గుడు. హ్యూయెన్ చేసిన అత్యాచారాన్ని చూసి సహించలేక వాంగ్ ఆ పని చేశాడే తప్ప మరొక కారణం కాదు. కాబట్టి కరుణించి అతణ్ణి క్షమించి వదలిపెట్టండి." అని మొర పెట్టుకున్నారు.

కాని రాజు చలించలేదు. వచ్చిన వాళ్ళు ఇక చేసేదిలేక మౌనంగా బయలుదేర బోయారు. అప్పుడు పద్నాలుగేళ్ళ కుర్రా డొకడు రాజు ముందు సాష్టాంగపడి, "ప్రభూ! వాంగ్ ప్రాణాలకు బదులు నా ప్రాణాలు తీయించండి!" అన్నాడు.

ఆ మాటలు విని రాజు ఆశ్చర్యంతో, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.



"ప్రభూ నేను వాంగ్ కొడుకును. మా తల్లికి మేము నలుగురు కొడుకులం. నేను పెద్దవాణ్ణి. నేను పోయినా, మా అమ్మకు ఇంకా ముగ్గురు కొడుకులు మిగులుతారు. కనుక ఆమెకు అంత కష్టముండదు. మా నాన్న లేకపోతే మాత్రం కుటుంబం జరగడమే కష్టమవుతుంది!" అన్నాడు కుర్రవాడు.

ఈ మాటలు వినేసరికి రాజుకు మరింత ఆశ్చర్యం వేసి, "ఒరే, నిన్ను మీ అమ్మ పంపిందా? లేక నువ్వే వచ్చావా?" అని అడిగాడు.

అందుకు కుర్రవాడు, "ప్రభూ నేను మా తల్లికి చెప్పకుండానే వచ్చాను. ఎందుకంటే, మా నాన్న బతకడం ఆమెకు సంతోషమే. అయినా కొడుకును పోగొట్టుకోవడానికి ఏ తల్లి మాత్రం ఇష్టపడుతుంది? కాలం గడిచేకొద్దీ నెమ్మదిగా మనస్సు ఎలాగో కుదుటపడుతుందనే ధైర్యంతో నేనే ఇలా వచ్చేశాను!" అన్నాడు.

ఆ కుర్రవాడి మాటలకు రాజు హృదయం ద్రవించింది. "నీ ప్రార్థన నేను మన్నిస్తున్నాను!" అన్నాడు.

కుర్రవాడు అమితానందంతో, రాజుకు మళ్ళీ ఒకసారి సాష్టాంగ నమస్కారం చేసి, "ప్రభూ! నేను ధన్యుణ్ణి తమకెంతో కృతజ్ఞుణ్ణి! ఎల్లుండివరకూ ఆగడం దేనికి? ఇప్పుడే మా నాన్నను చెర నుంచి విడుదల చేయించి, ఆయన స్థానంలో నన్ను ఉరి తీయించండి!" అన్నాడు.

రాజు ఆనందబాష్పాలు రాలుస్తూ, "నీ ప్రార్థన మన్నిస్తున్నాననడంలో నీ తండ్రికి బదులు నీ ప్రాణాలు తీయిస్తానని కాదు. నీవంటి ఉత్తమపుత్రుడు చిరాయువుగా వర్ధిల్లాలి కాని, ఇలాంటి దుర్మరణానికి గురి కాకూడదు. నీవంటి ఉత్తముణ్ణి కన్న నీ తండ్రి వాంగ్ కూడా ఉత్తముడే. కాబట్టి, శిక్షార్హుడుకాడు. దుర్మార్గుడయిన హ్యూయెన్‌ను నీ తండ్రి రూపంలో ఆ భగవంతుడే శిక్షించాడు," అని చెప్పి, తండ్రిని ఖైదు నుంచి విడిపించాడు.





'సూపర్ సారస్'

1972వ సం॥లో అమెరికాలోని కొలొరాడోలో రాక్షసబల్లి (డినోజార్) అవశేషాలు బయటపడ్డాయి. 8 అడుగుల పొడవు భుజం ఎముకలూ, పదడుగుల పొడవు గల పక్క ఎముకలూ, లభించాయి. వీటిని బట్టి ఆ రాక్షసబల్లి, 26 అడుగుల ఎత్తయిన భుజాలతో 90 అడుగుల పొడవూ 140 టన్నుల బరువూ కలిగి వుండేదని ఒక అంచనా. దీనికి 'సూపర్ సారస్' అని పేరు పెట్టారు.

'బ్లాక్ విడో' అనే ఒకరకం నల్లటి ఆడసాలెపురుగులో మనిషిని చంపగల విషం ఉన్నది. ఇది 'రేటిల్ స్నేక్' అనే పాము కన్నా 15 రెట్లు ఎక్కువ విషపూరితం. 1950-59 మధ్య, అమెరికాలో 63 మంది ఈ పురుగు కాటుకు గురై ప్రాణాలు కోల్పోయారు.



'బ్లాక్ విడో'

## చిరాయువు కలిగినపక్షి

ఆండియన్ కొండలలో నివసించే కొండార్ అనే ఒక రకం రాబందులే పక్షులన్నిటిలోకీ దీర్ఘకాలం జీవించినట్టు తెలుస్తున్నది. మాస్కో జూలో ఒక రాబందు 72 సంవత్సరాలుజీవించింది!



'మేరీ' గోల్డు కవరింగ్ జ్యుయలరీ ఫ్యాషన్సులో అందెవేసిన చేయి. ప్రపంచంలోని స్త్రీలందరూ నాణ్యతకు - మన్నికకు వాడవలసినవి - ధరించవలసినవి - అలంకరించవలసినవి. కంటికింపగు యీ ఆభరణముల కొరకు నేడే మీ ఆర్డరును పంపించండి. వి.పి.పి. ద్వారా ఆభరణములను పొందండి డిజైను నంబర్లను మరియు ఉచితమైన కేటలాగులను ప్రత్యేకముగా అడుగుట మరిచిపోవద్దు. భరతనాట్యానికి కావలసి ఆభరణములు కూడా ఇక్కడ లభించును.


No:676 Rs.200/50

No:379 Rs.300/50



No:472 Rs.375/50


No:532 Rs.275/50

No:758 Rs.300/50



No:442 Rs.200/50

No:438 Rs.200/50


No:435 Rs.200/50


No:611 Rs.100/50



No:690 Rs.100/50

Rs.100/50 No:396



No:811 Rs.200/50


No:556 Rs.300/50

No:347 Rs.150/50



No:691 Rs.100/50

No:589 Rs.80/50


No:306 Rs.100/50


DAD/MGC/102

No:771 Rs.150/50



No:694 Rs.100/50


No:544 Rs.250/50

No:599 Rs.100/50


No:637 Rs.100/50


No:745 Rs.175/50

No:305 Rs.100/50


No:402 Rs.100/50




No:651 Rs.100/50

No:391 Rs.150/50


No:630 Rs.100/50


No:317 Rs.100/50


No:742 Rs.150/50

No:729 Rs.200/50

# MERI GOLD COVERING WORKS

P.O.BOX 1405, 14, RANGANATHAN STREET
T.NAGAR, MADRAS - 600 017, PHONE: 444671

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



R. B. Shinde



R. B. Shinde

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రక్షణకు ముందున్నా! రెండవ ఫోటో : శిక్షణ నే పొందుతున్నా!

పంపినవారు : యం. శంకర్‌రెడ్డి, గాంధి చౌక్ రోడ్, బెల్లంపల్లి—504 251.

బహుమతి మొత్తం రు. 50/— నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# విజయచిత్ర

సినిమా వినోదానికి ప్రతినిధి
పాఠకులకు పరిశ్రమకూ వారధి

వర్ణచిత్రాలు కంటికి ఆనందం
తారల కబుర్లు మనసుకు ఆహ్లాదం

చూసినకొద్దీ చూడాలనిపిస్తుంది
చదివినకొద్దీ చదవాలనిపిస్తుంది

ప్రజాదరణే పునాదిగా



24 సంవత్సరాలుగా
నిర్విరామంగా, నిత్యనూతనంగా
వెలువడుతోంది...

తప్పక చదవండి - చదివించండి!

**విజయచిత్ర**

చిత్రప్రియుల అభిమాన పత్రిక

# MORE THAN A MANGO!

nutrine
Naturo
MANGO FRUIT BAR

NATURO FROM NUTRINE. A THICK JUICY MANGO BAR.
MADE FROM PURE MANGO PULP.
SWEETER AND SO MUCH MORE THAN JUST A MANGO.




Mudra:Bir:NN:310:90